# అవును

నేను డెట్ వాడుతున్నాను
నా నూలు. వూలు. సిల్కు. నైలాన్ దుస్తులన్నిటిని
డెట్‌తో ఉతుకుతాను. బట్టలను
రుద్దనక్కరలేకుండా డెట్‌తో ఉతుకుపని త్వరగా
అవుతుందని తెలుసుకొన్నాను. దానిని వాడితే
బట్టలను తెల్లగా చేయుటకు రసాయన పదార్థము
చేర్చనక్కర లేదు మరియు జిగురు, నూనె
మరకలు పూర్తిగా పోవుట నేను చూచేను.
వంట గిన్నెలు, ముఱికి నీరు చేరుచోట్లు, యిల్లు
కడుగుటకు నేను డెట్‌నే వాడతాను.
కొంచెము డెట్‌తో ఎక్కువ శుభ్రముచేసే
పని అవుతుంది కనుక మొత్తముమీద చూస్తే
అది ఎంతో పొదుపు చేకూరుస్తుంది






స్వస్తిక్ ఆయిల్ మిల్స్ లిమిటెడ్, బొంబాయి

snilpi-som-2-Tel



"బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి"



# ఆంధ్రమహిళ

సంపుటి 14 :: జూన్ '58 :: సంచిక 6

వ్యవస్థాపకురాలు
శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపాదకురాలు
శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

## విషయానుక్రమణిక




సంపుటి 14 :: జూన్ '58 :: సంచిక 6

# ఆంధ్ర మహిళలకో?

క్రిందటి నెల ఈ పుటలో దేశమంతటా స్త్రీలకు కలుగుచున్న ఘన విజయ పరంపరలు పేర్కొన్నాము. వారు అలంకరించుచున్న యుక్తమగు స్థానములు ద్విగుణీకృతములు అట్టి స్థానములు మహిళలు అలంకరించి నందుకు మేమెంతో ఆనందించాము, గర్వించాము,

కాని మాకు ఒక విచారము విచారముగానే మిగిలిపోయింది. దేశమంతటా స్త్రీలిట్టి ఘన విజయ పరంపరలలో నోలలాడుచుండే మన ఆంధ్ర ప్రదేశములోని స్త్రీలకేల ఇట్టి అదృష్టము కలుగలేదు? ఆంధ్ర దేశములో అట్టి స్థానము నలంకరించుటకు తగిన మహిళలు లేరా? అర్హులైన మహిళలకు ఆంధ్ర దేశము గొడ్డుపోయిందా? లేక ఈ సమస్య మరుగున ఏమైన చిదంబర రహస్యమున్నదా?

మన అసెంబ్లీలో తగినంత మంది స్త్రీలు గాని, మంత్రి వర్గములో అసలే స్త్రీ లేకపోవటానికి గాని కారణమేమిటి? పంచాయతీ బోర్డులలో, బోర్డు స్త్రీలే వుండటము తప్ప మన ఆంధ్ర ప్రదేశములో స్త్రీలకు తగిన అధికార స్థానములు లభించకపోవుటకు కారణమేమై యుండును.?

ఎన్ని వారసత్వపు ఆస్థి హక్కులు సంక్రమించినా, రాజ్యాంగము ద్వారా జన్మ హక్కులు లభించినా మన స్త్రీలు ముఖ్యంగా ఆంధ్రదేశములోని స్త్రీలు తను ఆత్మని దప్ప "ఇది నాది" అని ఘట్టిగా చెప్పుకొనే స్థితిలో లేరు. అట్టి వారు ఎన్నికలలో పాల్గొనుటకు ధనమెక్కడ నుండి తెత్తురు? ధైర్యమెక్కడ నుండి తేగలరు? అంతమాత్రము ధైర్యము లేని వారు బాధ్యతాయుతస్థానములు ఆక్రమించి ఏమి చేయగలరు. అలంకార భూషణములా అని సందేహము రాక మానదు.

నేటి సాంఘిక రాజకీయ పరిస్థితులు పురుషులకే చాలా క్లిష్టముగా నున్నవి. స్త్రీలకింకా ఎక్కువ క్లిష్టముగానున్నవని వేరే చెప్పనవసరములేదు. స్త్రీలు ముందడుగు వేయందీ దేశము వేయలేదు. మహిళాభ్యుదయము సాగందీ దేశాభ్యుదయము సాగదు. కాని స్త్రీలేల ముందడుగు వేయరు? వారికనేక అనుకూల పరిస్థితులు ప్రభుత్వము, దేశ నాయకులు చేయుచున్నారు కదా? రెక్కలు కత్తిరించి గూటిలో వేయ బడ్డ చిలుక ఒక్కసారి ఎగురలేదు. కలకాలము నుండి బంధింప బడ్డ స్త్రీలు ఒక్కసారి స్వాతంత్ర్యామృతమును గ్రోలలేరు. అంతే గాదు. మన తప్పులు మనము ఒప్పుకొనక తప్పదు. మన స్త్రీలు అట్టి స్వాతంత్ర్యామృతమును గ్రోలుటకు మన సోదరులే ఒప్పుకొనరు ఇంకా రుద్రమనాటి మనోవృత్తి సోదరులలో మారలేదు. కలకంఠి కన్నీరు సంఘానికి, దేశానికి కూడా చేటే.

మేము స్త్రీలను అధికార స్థానములను ఆక్రమించమని, పదేపదే హెచ్చరించునది ఎట్టి వ్యక్తిగత అహంభావనతోటిగాదు. అట్టి వుద్దేశమేలేదు. దేశాభ్యుదయమే మాకు కావలసినది. దానికి. మహిళాభ్యుదయము అత్యవసరము గనుక దానికై కృషిచేసి అనుకూల పరిస్థితులు గలిగించాలనే మా వాంఛ.

చేతిలో చిల్లి గవ్వలేని స్త్రీలకు ఎట్టి ధైర్యముండగలదు? వారు ఎన్నికలయందు ఎట్లు పాల్గొన గలరు? కావుననే ఎన్నికలయందు ఇతోధికముగా స్త్రీలు పోటీ చేయుటలేదు. శక్తిసామర్ధ్యము గల స్త్రీలు చాల మంది వున్నను అట్టివారికి అవకాశములు లభించుటలేదు. కావున ఇంకా కొన్నిసంవత్సరముల వరకు స్త్రీలకు నామినేషన్లు అవసరమని చెప్పక తప్పదు. ఇదివరలో నామినేటడు సీట్లలో వున్న స్త్రీలు తమ బాధ్యతలు సక్రమముగానే కాగుండా అతినైపుణ్యముతో చక్కబెట్టుట మనము చూచే వున్నాము. కావున రాజ్యాంగము స్త్రీలకు సమాన హక్కులు కలిగించినా, వాటిని, వారసత్వపు హక్కులు స్త్రీలు అనుభవించుటకు ఆరంభించే వరకు వారికి ప్రత్యేక ఏర్పాటులు అవసరములు. కాని దాని వల్ల లాభము పొందేది ప్రత్యేకము స్త్రీలేగాదు. స్త్రీ పురుషులు సమముగా అభివృద్ధిపొందిన సాంఘికావస్థ నుండి అందరూ లాభము పొందగలరు.

కాని నేడు వారికి ప్రత్యేకపు ఏర్పాట్లులేవు సరికదా, అన్యాయము కూడ జరుగుచున్నది. ఎన్నికలలో స్త్రీలకు తగినన్ని స్థానములు లేవుకదా ప్రభుత్వము తమ నామినేటడు సీట్లల్లో స్త్రీలకు సగము సీట్లు ఏల కేటాయించుటలేదు? రేపు రానున్న కౌన్సిలు ఎన్నికలలో స్త్రీలను సగము సీట్లుకు పోటీకి నిలబెట్ట గలరని, లేనిచో నామినేటడు సీట్లలో ఇతోధికముగా స్త్రీలకు కేటాయించవలెనని మేము కోరుట అసమంజసముకాదు. పోటికి నిలుచున్న స్త్రీలకు ఆ ఆ పార్టీలు, ప్రచారము ఇతర సహాయము చేయవలసి యుండును, పన్నెండు సీట్లు ప్రభుత్వము నామినేటు చెయ్య వలయును. అందులో న్యాయముగా ఆరు స్త్రీల సీట్లే. పోతే ఇంకా రెండు సీట్లు కూడా స్త్రీలకు ప్రత్యేకించి మొత్తము ఎనిమిది సీట్లకు స్త్రీలను నామినేటు చేయుట ధర్మముగా తోచుచున్నది.

అడగనిదే అమ్మయినా పెట్టదట. కావున ఆంధ్ర దేశములోని మహిళా సంఘాలు ప్రభుత్వాన్ని మహిళలకు కౌన్సిలులో హెచ్చు ప్రాతినిధ్యమివ్వవలయునని కోరుటే నేటి కర్తవ్యము దేశాభ్యుదయమే కాంక్షించే ప్రభుత్వము వారి కర్తవ్యము నిర్వహించగలరని మేము ఆశించుచున్నాము. ★

# ప్రాచీన ప్రపంచ చరిత్ర - రమణీమణులు

శ్రీమతి వారణాసి యశోదాదేవి

పురాతన కాలంలో గ్రీసు, యిటలీ, యీజిప్టు. తదితర దేశములలో భారత దేశంతో సాటియైన నాగరికత వెలసినది. ఈ దేశములందలి స్త్రీల పరిస్థితులను కొంత వరకు పరిశీలించుటకు ప్లూటార్కు రచనలు కొంత సాయ పడుచున్నవి.

గ్రీసుదేశ మందలి ప్రధానమైన పట్టణ రాజ్యమైన యేథెన్సులో స్త్రీలకు యే విధమైన ప్రత్యేక హక్కులు లేవు, స్పార్టా పట్న రాజ్యములో మాత్రము రమణీ మణులకు గృహ కృత్యముల జక్కదిద్దుకొనుటయే గాక, రాష్ట్రమును నిలువ బెట్టుటకు తగిన దారుఢ్యము గల సంతానము నిచ్చుట వారి బాధ్యతయై యుండెను, కాబట్టి స్పార్టను స్త్రీలు సాము విద్యల నభ్యసించి, మల్ల యుద్ధము మొదలగు శారీరక వ్యాయామములలో ఆరితేరిరి. పురుషుల సమక్షమున, స్త్రీలు యీ విద్యలను ప్రదర్శించు చుండిరి. స్పార్టను మహిళలకు స్వాతంత్ర్యముండెను. ఇరువది యేండ్ల ప్రాయమున స్త్రీలు వివాహమాడు చుండిరి! భార్యా భర్తలొకచోటనే వసింప కుండిరి; రాకపోకలు మాత్రి ముండెడివి. ఒక అన్యదేశపు కాంత లెయొనిడసు భార్యను, "మీలో స్త్రీలు పురుషుల నేలుదురు" నెనట, ఆ హేళనను లెయొనిడసు భార్య "మా స్పార్టను స్త్రీలే పురుషులను కనెదరు"ని ఖండించెనట, స్పార్టను స్త్రీలు భర్తలను, కుమారులను శూరులు, ధీరులునగు నటుల ప్రోత్సహించు చుండిరి. కుమారుడు యుద్ధమునకు పయనమగునప్పుడు తల్లి, "నాయనా; డాలు పట్టుకొని మరలి రమ్ము; కాని పక్షమున దాని పట్టుకొని పడిపొమ్ము" మని యుపదేశించునట, ఈ సంఘటన మనచరిత్ర యందలి వీర మాతలను, వీర పత్నులను, వీర వనితలను స్మృతి పథమునకు దెచ్చుచున్నది. ఖడ్గతిక్కన తల్లి, భార్య, బాలచంద్రుని సతి మాంచాల సుప్రసిద్ధులు గదా!

స్పార్టను స్త్రీలు పురుషులతో నాట పాటలలో కలిసి మెలసి తిరుగుచుండిరి. నాట్య విద్యలో ప్రవీణులకు బహుమానము లియ్యబడుచుండెను. స్పార్టాలో నీమార్పులన్నియు లైకర్గీసు చేసెను, ఏథెన్సులో సోలన్ ప్రభువు స్త్రీలకు సంబంధించిన కొన్ని నిబంధనలను, పద్ధతులను అమలులోనికి దెచ్చెను. స్త్రీకి వివాహము తర్వాత సారె చీర లిచ్చుట సోలను మాన్పించెను, పురుషుడు స్త్రీని పరిణయమాడు నప్పుడు, సద్గుణములకు విలువనిచ్చునా, ధనమును విలువ గట్టునా, యని యితడు ప్రశ్నించు చుండెను. రమణీమణులు ప్రయాణమైపోవునప్పుడు శకటములకు ముందు దివిటీలు వుంచవలెనని సోలను శాసించెను. ఇడుముల నెదుర్కొన వలసిన పరిస్థితులలో స్త్రీల ప్రవర్తనను గూర్చి సోలను కొన్ని షరతులను యేర్పాటు చేసెను. సోలను ప్రభువు చట్టములు ఏథెన్సు రాజ్యములో నూరేండ్లు యమలులోనుండెను.

మాసిడోనియను చక్రవర్తియు, జగజ్జెట్టి అలగ్జాండరు తండ్రియునైన ఫిలిప్పు II మొదటి భార్య ఒలింపియస్, అలగ్జాండరు తల్లి. ఈమె తన భర్త, పుత్రుడు యింటలేని సమయములో సవతి బిడ్డను, సవతి క్లియోపాత్రాను హత మార్చెను, అలగ్జాండరు తల్లి ప్రవర్తనకు నిశ్చేష్టుడై పోయాడు. కాని మాతృప్రేమచే ప్రేరేపితుడై, మాసిడోనియాలో ముఖ్యమైన యధికారమును యామెను వదిలిపెట్టి, తాను యొచటనున్నను, తల్లికి యమితముగ ధనము పంపుచుండు నాడు ఒలింపియస్ అలగ్జాండరుకు రాజకీయ, మత విషయములపై లేఖలు లిఖించుచుండెడిది.

ఆ కాలపుటాచారము ప్రకారము ఫిలిప్పు II క్లియోపాత్రాను ద్వితీయ కళత్రముగ స్వీకరించెను, ఒక నాడు ఆమె పినతండ్రి నిండు సభలో తన కుమార్తె గర్భము ఫలించి రాజార్హతగల కుమారుని గనవలెనని దైవ ప్రార్థన చేయుడనెను, అంత అలగ్జాండరు క్రుద్ధుడై, తండ్రి కొడుకులు కలహించిరి.

ఇటలీ దేశము— ముఖ్యముగా రోము నగరం యెన్నో శతాబ్దములు ఐరోపాలో నగ్రస్థానం పొంది శాశ్వత నగరమనియు, ప్రపంచ లక్ష్మి యనియు పేర్గాంచియుండెను, రోమను చరిత్రలో ఐరేని అను రాజమాత చక్రవర్తి యగు తన కుమారుని చంపి, తాను చక్రవర్తిని యగుటకై యాశించెను, పుత్ర హత్యచేసిన యీపె మహా పాతకిగదా!

జూలీయస్ సీజరు కాలంలో, పార్థి యనులతో యుద్ధం చేసి హతుడైన కుమార క్రెసస్సు భార్యను పాంపే ప్రభువు పెండ్లి యాడెను, ఈమె సౌందర్యవతి, 'విద్యావతీ. బీజగణితము నేర్చియుండెను' వీణాగానము చేయుచుండెను. భర్తకు భక్తితో శుశ్రూష చేయుచుండెను,

మార్కు అంటోనీ భార్యయైన ఫుల్వియా, ప్రజాధిపతులను, సేనాపతులను వశము చేసికొను శక్తిగల్గియుండెను. భర్త యీజిప్టు రాణి క్లియోపాట్రాతో విలాసంగ కాలము బుచ్చుచున్న రోజుల్లో యీమె రోములో భర్త పక్షముగా యనేక కుట్రలు పన్నెను, ఈమె రోములో తన బిడ్డలను, సవతి ఆక్టేవియా బిడ్డలను పెంచెను, మరొక సవితి క్లియోపాట్రా బిడ్డలు రాజ్యముల నేలిరి.

ఈజిప్టులో పురాతన నాగరికత వేల కొలది సంవత్సరములు దివ్యముగా వెల్గినది; అంతరించినది మహోన్నతమైన పిరమిడులు, స్ఫింగ్స్ విగ్రహము, దేవాలయ శిధిలములు, రక్షిత మానవ కళేబరములు. యివియే యిప్పటికి మిగిలిన నాగరికతా చిన్నెలు. అలగ్జాండరు తర్వాత యతని సేనాని టోలిమీ యీజిప్టు సామ్రాజ్యాధిపతి యయ్యెను, టోలిమీ రాజులు గ్రీకులయ్యు, యీజిప్టు దేశీయుల యాచార వ్యవహారములు నవలంభించి, వారి ప్రాచీన దేవతలైన యీసియాస్, ఓసిరిస్‌ల కొల్చుచుండిరి రాజధానియైన అలగ్జాండ్రియా గొప్ప వర్తక కేంద్రమై యుండెను, రోమను చక్రవర్తులైన జూలియస్ సీజరు ఆక్టేవియను మార్కు ఆంటోనీల మరులు గొల్పిన ఈజిప్టు రాణి క్లియోపాట్రా టోలిమీ వంశీకురాలు.

క్లియొపాట్రా సుందరవతి. యని లోక ప్రఖ్యాతి గాంచినది. ఆమె కీర్తి యకళంకతముగాదు. కాని తన సౌందర్యమును పురస్కరించుకొని చరిత్ర గతిని మార్చినట్లు చెప్పబడు రమణీమణులలో యీమె యగ్రగణ్యురాలు. సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత పాస్కల్, "క్లియోపాట్రా ముక్కు కొంచెము కురుచగానున్నచో ప్రపంచ స్వరూపమే మారి యుండెడిది" యనెను, ఇది కొంత యతిశయోక్తి యేమో !

టోలిమి వంశములో జన్మించుటచే క్లియోపాట్రా గ్రీకు లేక మాసిడోనియను రాకుమార్తెయై యున్నది. రాజు పాలకుడు. చక్రవర్తి భగవంతుడను భావము యీజిప్టులో పాతుకొని యుండి, క్లియోపాట్రా ప్రోద్బలము వల్ల కావచ్చు జూలియస్ సీజరులో ప్రవేశించి, రోములో పాదుకొనెను. రాజు దేవాంశ సంభూతుడను భావన ప్రాచీన భారత దేశమునకు సుపరిచితమైనదే !

జూలియస్ సీజరు క్రీ. పూ. 102 సం॥లో జన్మించి క్రీ. పూ. 45 నాటి సం॥ రోమక రాజ్యము నంతను వశపర్చుకొని ప్రజారంజకుడయ్యెను. వయస్సులో పాంపే, సిసిరోలకంటె నాలుగేండ్లు చిన్నవాడు. రాజ్యము నంతను సర్వే చేయించి. కాలెండరును సంస్కరించెను, ప్రజారాజ్యమును యేక రాజ్యాధి పత్యముగ జేయ యత్నించి దెబ్బతినెను, మహోన్నత దశననుభవించు రాణి క్లియోపాట్రా మోహపాశములలో జిక్కెను, ఒక్కయేడాదిఆమెతో సుఖముగ యీజిప్టులో గడిపి, పిమ్మట తనతో రోముకు ఆమెను తీసికొని వచ్చెను. అచట సీజరుపై క్లియొపాట్రా వశీకరణ శక్తి తగ్గెను, సీజరు అలగ్జాండరువలె తాను దేవుని ప్రతినిధి నని నమ్ముచుండెను ; మైమరచి యుండెను సీజరు పతనము నకు, మృతికి ముఖ్య కారకురాలు రాణి క్లియొపాట్రా.

సిజరు హతుడైన పిదప, అతని అనుయాయి మార్కు అంటోనీ క్లియొపాట్రా కామోద్రేకమునకు గురియయ్యెను, అంటోనీ సుపురద్రూపి ! శృంగార పురుషుడు, చిన్న తనము నుండియు మద్యపానమత్తుడై వారాంగనల పొత్తులో నుండువాడు. కాని తర్వాత గొప్ప వక్తయయ్యెను ; శూరాగ్రేసరుడై గ్రీకు రాజు గభీనియసుచే యీజిప్టుకు పంపబడి, యా రాజుకు జయము చేకూర్చెను.

సీజరు మరణానంతరం రోమన్ రాజ్యవిభజనలో సారవంతమైన తూర్పు భాగము, క్లియొపాట్రాతో సహా అంటోనీకి చెందెను, అంటోనీ కుమార్తెను అగస్టసు సీజరుకిచ్చి పెండ్లిచేసెను, అంటోనీ కాలము నాటికి క్లియొపాట్రా యవ్వనవతి ! అపరరతీదేవియే ! నాలుగైదు భాషల చక్కగ నేర్చియుండెను ; సరస భాషిణి, ఆమె వైభవం జూచి అంటోని వ్యవహారములన్ని విడిచిపెట్టెను, "అహో మోహస్య దుస్చేష్టితం" ; విందులు. వినోదములలో క్లియొపాట్రా, అంటోనీలు మునిగి తేలువారు. కొంత కాలము క్లియొపాట్రా సన్నిధి యందు, మరి కొంత కాలం గ్రీసులోను అంటోనీ గడపుచుండెను, క్లియొపాట్రాను స్మరింపని దిన మతనికిలేదు. "భ్రష్టవాకాస్యగతిః" దుర్వ్యసనములలో బడిన మనుజునకు బుద్ధి మాంద్యము తథ్యము, అపజయములతో బాధ పడుచున్న అంటోని మనస్సు క్లియొపాట్రాపై లగ్నమై, ఆమెను గాంచి అమందానందముందు చుండెను.

అంటోని భార్య పిల్లలతో వచ్చుచున్నానని కబురు చేయగా, క్లియొపాట్రాలో సవతి వైరమంకురంచి, భోజనమును మాని కృశించి భర్త్ృ వియోగము సహింపలేని దానివలె నటించెను, అంటోని కామె యందిరువురు బిడ్డలు కల్గిరి.

క్లియోపాత్రా వలపులకు జిక్కిన అంటోనీ భార్యను యేథెన్సులో నుండగోరెను, క్లియోపాత్రాతో రోమునకేగి పరాభవము పొంది మరల యీజిప్టు చేరుకొనెను ; అగస్టసు సీజరుతో సంధిరాయ భారములు సాగించెను, అగస్టసు క్లియోపాత్రాను క్షమింతును గాని అంటోనీని దండింతునని సందేశమంపెను, క్లియోపాత్రా అంటోనికి చేసిన వుపకారమేమి లేదు ; పైగా గొప్ప నౌకాయుద్ధములో తన 60 నౌకలతో ఆమె పలాయనమై ద్రోహము చేసెను, అందువల్ల అంటోనీ యోడిపోయెను, తర్వాత అవసాన దశలో అంటోనీపై అగస్టసు సైన్యములు దండెత్తిరాగా, యుద్ధము చేయుచు, క్లియోపాత్రా పంపిచిన వార్త- ఆమె చనిపోయినట్లు- నమ్మి అంటోనీ తన కడుపులో కత్తిని గ్రుచ్చుకొనెను ! కాని చావలేదు, తర్వాత ఆమె జీవించి యున్నదని దెలిసి, సేవకులు యతని యామె యొద్దకు తీసుకొని పోయిరి. తదనంతరము అంటోనీ చనిపోయెను.

ఇక అగస్టసు సీజరును వశము చేసికొన ప్రయత్నించి, విఫలురాలై కడకు ఆత్మహత్య గావించుకొనెను. అగస్టసుకు తన యభీష్టమును, దైన్య దశను దెలియ పర్చుచు క్లియోపాత్రా వార్తపంపెను. కాని అక్టేవియను యీమె మోహపు వురులలో జిక్కక ఆమె తనచే జిక్కినదని రోములో ప్రకటించి వీధులలో త్రిప్పి. తన విజయముల సాటించెను, ఆ యవమానమును భరింపలేక క్లియోపాత్రా నునాయాసమరణమునకై వుపాయముల పరికించి Asp అను పురుగు కాటు మంచిదని యెంచి, రోమను కావలివాండ్ర ద్వారా ఆ పురుగులను రహస్యముగ దెప్పించికొని, కరపించుకొని ప్రాణములు విడచెను.

ఈ విధముగ క్లియోపాత్రా తన జీవితములో తన్ను పరిపూర్ణముగ నమ్మికొని సర్వస్వము తన కర్పించిన జూలియసు సీజరును, యతనిపై కొండెములు బ్రూటసుకు చెప్పి హత మార్చెను, మగల అంటోనీని కామించి సర్వభ్రష్టుని చేసి క్రీ. పూ. 31 లో ఏక్టమ్ నౌకా యుద్ధములో ద్రోహము చేసెను, ఈమె ముందుగ యోచించి అంటోనీని మోసగించెనా లేక ఆ చంచల ఆ క్షణమునకటుల ప్రవర్తించెనా యని తెలియ రాదని చరిత్రకారుడు వెల్స్ అభిప్రాయము. అంటోనీ యుద్ధమును విడచి సేనాపతుల కాజ్ఞలైన యివ్వకుండ క్లియోపాత్రాను వెంబడించి సమాధాన పర్చుకొన్న యుదంతమును ప్లూటార్కు బహు చక్కగ వూహించెను, కడకు అక్టేవియను తన సౌందర్యమునకు దాసుడు కానందుకు క్లియోపాత్రా ప్రాణ త్యాగము చేసెను. సుశీల గాని స్త్రీ సాహస కృత్యములకు మేరలేదు గదా. ! ★

# అమృతాంజనము

అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తి కలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు!




అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు - 4
బొంబాయి - 1.
కలకత్తా - 7

AL-87-1 TELUGU

# భాషా విజ్ఞానత

శ్రీమతి దీదువాని బదరీనారాయణమ్మ

మానవుడు తన స్వానుభవమంతా ఒక కథారూపకంగా వాగేంద్రియము ద్వారా ప్రకటించ గలుగుతాడు. పశు పక్షి మృగజాతులు కొన్ని కొన్ని మూగ సంజ్ఞలచే అభినయించగలుగుతవి. కానీ వాక్పటుత్వముచే భాషా విజ్ఞానతను విప్పిచెప్పలేవు. మానవునకు పశుపక్షి మృగాదులకూ, గలభేదమంతే. మానవుని జీవితమొక కథ. పుట్టుకలగాయతు గిట్టువరకూ జరిగినభాగమంతా ఒకకథారూపకమే. ఉగ్గూ పాలూ త్రాగి, ఉక్కూ- ఉంగా, ఉత్తూ, అనే శబ్దాలలోనుండీ ఒక కథారూపకం ప్రారంభం అపుతుంది. ఆటపాటల నేర్చి, బడికివెళ్ళి విద్యాభ్యాసంచేసే కాలంలో తాను చేసిన మంచిపనులుకాని, కొంటిపనులుకాని, యింట నుండు ముసలమ్మలతో ఏదో వర్ణనలో చెప్పుతేనేకానీ వుండలేదు. మామ్మా! మామ్మా! యీవాళ అమ్మ చద్దెన్నం త్వరగా పెట్టలేదు. అందుకని నేను బడికి పోవడం ఆలస్యమైంది. మేస్టరుగారికి కోపంవచ్చి బల్ల మీదనించోబెట్టి కొట్టినారు, నా ఒళ్ళంతా నొప్పి పుట్టింది అని నాయనమ్మతో రాగాలుపెడుతూ చెప్పు తాడు. అప్పుడే ఒక సాహిత్య క్రమం స్థిరపడిందన్న మాట. అవి సంతోషనువనివ్వండి, విచారమువనివ్వండి, అదే ఒక కథ. యిందులో కొన్ని కర్తా, కర్మా, క్రియ, లిమిడి యున్నాయి. కొన్ని ప్రశ్నలకు తావు కలిగింది. దీనినే సాహిత్యోత్పత్తి క్రమమంటారు.

కథ ఎలా పుట్టింది? ఏ దేశంలో పుట్టింది? ఎప్పుడు పుట్టింది? కథలలో కల్లా మొదట కథ ఏది? అంటే ఎవరు చెప్పకలరూ, ఏదేశానికి ఆదేశమే గొప్పది. ఏ దేశచరిత్రలకు ఆ దేశ చరిత్రతే పవిత్ర ప్రమాణికాలు. ఏ కాలానికి ఆకాలమే అంతకు మొదటికాలమైయుంటుంది. ఐతే సృష్టే మొదలైయుంటుందనుకోవలసి వస్తుంది. సృష్టిలోంచి వచ్చినభాష ఏమిటంటే ఎవరు చెప్పగలరూ. (ఓం) కారమేపెద్దల నమ్మికలు. యీ (ఓం)కారమే, చంటిబిడ్డల (ఊ (ఉక్కూ (ఉంగా (ఉత్తూ) అను శబ్దాలగా మారింది. యీ (ఓం)కారం లోంచీ, ఋక్కులూ, వేదములూ, పుట్టినాయి. వాటిలోంచి క్రమంగా సంస్కృత పదాలు బయలుదేరినాయి. రానురాను ఆ సంస్కృత పదాల్లోంచి కొన్ని భాషలేర్పడ్డాయి. యీ సంస్కృత తత్సమ శబ్దాలే కొన్నికొన్ని యింగ్లీషులోనూ, హిందీలోను అనేకము లున్నవి. కథకుమూలం, భాషకు ప్రప్రథమేదోనిజంగా ఊహించాలంటే (ఓం) కారమని నిర్ధారణచేయవచ్చు.

| | | |
|---|---|---|
| సం | ఇం | హిం |
| మాతః | మదర్ | మాం |
| పితః | ఫాదర్ | బాప్ |

కవి అగాధ హృదయములో వుండుకున్న భావాలన్నీ మెదడులోనికి ప్రతిబింబిస్తాయి. ఆ ప్రతిబింబించిన భావాలన్నీ బుద్ధిబలంచే ప్రకటింప గలుగుతాడు. పాటల పాడికాని, పద్యాలుచేసికాని, ఫొటోలు గీసిగానీ, శిల్పకళల నొప్పించికానీ, యింకా అనేక వివిధోపాయాలుచే.ఎలా అంటే, ఒక నూతిలోని నీరు, బొక్కెనలచే కొంతమంది, చెంబులకు త్రాడు గుచ్చి కొంతమంది, తాటాకు చేదలతోను, యింకా వివిధోపాయాలచేత త్రోడ కలుగుతారు. ముఖ్యాభిప్రాయం నీరును సంప్రాప్తించు కోడమే. ఆ విదంగానే కవియొక్క హృదయ భావాలుకూడాను. ఐతే పై అంశలను కవిత్వ మంటారా అంటారేమో? అలా ఏలా కౌతుంది, కవిత్వ మనేది వాక్శుద్ధితో వచ్చే భాషా విజ్ఞానాన్నే అంటారు. ఆ భాషా విజ్ఞానతకు, కొన్ని అలంకారాలు, చమత్కారాలు, కొన్ని ఉపమానాలు కొన్ని ఉపమేయాలు, కొన్ని విశేషణ విశేష్యాలు కలపద సంపుటితో జనాకర్షణీయమైనదే, కవిత్వము, భాష, విజ్ఞానత. యీ భాషా విజ్ఞానతే లోక వ్యాపారమునకు ఆధారపట్టు, నానాదేశములలోనూ ఆయా

దేశపు పడికట్టుమాటలే ఒక భాషగా పరిగణింప బడు తోంది. యిదివరలో యేదేశపుభాష లాయాదేశస్తులే కాని యితర దేశస్తులు గ్రహింపలేక పోయేవారు. కేవలం యితరభాషలను నేర్చి లోక వ్యాపారాలను విదేశవార్తలను గ్రహించగల వ్యక్తులు అరుదుగా వుంటూ వుండేవారు. వారినేదు భాషీలనీ, త్రిభాషీలనీ అంటువుండేవారు. రానురాను ఆధునికకాలంలో యితరదేశ సంబంధ బాంధవ్యాలు, కలయిక అధికమవడంచే భాషలలోకూడా మార్పులు కలిగాయి. కవిత్వాలలో కూడా మార్పు కలిగింది. పూర్వపు కవులు, కాళిదాస, భారవి, భవభూతి, తిక్కన, శ్రీనాధ మొదలగు సంస్కృతాంధ్రకవుల కవిత్వాలు త్రికరణ శుద్ధి చేసుకుని దేవి శారదాంబ వరప్రభావంవల్ల చేయ కలుగుతూ వుండేవారు. యిప్పుడు అపదగుంభనలను కవిభావాన్ని గ్రహించేవారు కూడా తక్కువ. నూతన శకంలో ఆధునిక కవిత్వానే వినియోగ పరచాలి. ఒక శాస్త్రుల్లగారికి యింగ్లీషు చదువుకున్న భార్య వస్తుందనుకోండి ఆ శాస్త్రుల్లుగారు భార్యతో యిలా అంటాడు. ఏమే ! రసాయనంశిద్ధంకురు) అని సంస్కృతంతో అడుగబోతాడు. (I don't know that) అంటుంది భార్య. కనుక ప్రస్తుత కాలమాన లోకవ్యవహారాలకు సరియగు కవిత్వమే చేయాలి.

ఇదీ అదీ కాకుండా భారత ప్రభుత్వం నానా భాషా సంపుటీతో యింకొక కొత్త భాషను రాజకీయ రంగంలోనికి తేవాలనుకుంటున్నారు. యీ భాషకు డిక్షనరీలు కూడా మారవచ్చు. ముసలాళ్ళ చదువులు మొదటకు రావచ్చు.

---

# లఘు పరిచితలు - వాసంతి

శ్రీమతి జి. సుందరీ శంకరం

లఘు పరిచితయైన వాసంతిని గురించి మనం తెలుసుకోవాలీ అంటే భవభూతి రచించిన 'ఉత్తర రామచరిత్ర నాటకాన్ని తెలిసి వుండాలన్నమాట. సాధారణంగా పెద్ద నాటకాల్లో అనేక పాత్రలు వస్తూవుంటాయి పోతూ వుంటాయి. కాని కొన్ని చిన్న పాత్రలు నిర్వహించేది యెంత చిన్న సంఘటన యైనా, అది మన హృదయానికి హత్తుకొని పోవడం. ఆ నాటకం తలంపుకు వచ్చినప్పుడల్లా' ఆ పాత్ర యొక్క ప్రాముఖ్యత గుర్తుకు రావడం జరుగుతూ వుంటుంది. అటువంటి పాత్రను నిర్వహించి ప్రముఖత వహించిన వారిలో నొకతెయే మన వాసంతి.

ఉత్తర రామ చరిత్ర నాటకంలో నాయికానాయకులు సీతారాములు. వీరు మనకు సుపరిచితులైన వారేకదా: కాని వనదేవతయైన వాసంతి కూడా ఇందులో ఒక పాత్ర. అతిథి పూజావ్రతమునకు పేరు వడసినది. సౌజన్యవతి. సీతకు చెలికత్తెగా నుండినది. ఈమె ఈ నాటకంలో నిర్వహించిన పాత్ర మిక్కిలి స్వల్పమైనదే కాని కథా సంవిధానానికి ఎక్కువ తోడ్పడింది. సీతా పరిత్యాగంలో గల శ్రీరాముని అంతర్యమును బయలు పరచుటకు ఉపకరించింది.

సీతాదేవి నిండు చూలాలుగా ఉన్నప్పుడు ఆమెకు, పూర్వము తాము విహరించిన వనప్రదేశములు తిరిగీ చూడాలని కోర్కె జనిస్తుంది. అది శ్రీరాముని కెరిగిస్తుంది, వెంటనే అతడు ఆమె కోర్కెను తీర్చడానికీ,తాను గూడ సీతతో వన విహారనికి వెళ్లడానికీ అంగీకరిస్తాడు. కాని యింతలో సీతాదేవికి కళంక మాపాదించి జనులు నిందిస్తున్నారన్న వార్త చెవిని పడుతుంది. శ్రీరాముడు దుఃఖ సాగరంలో మునిగిపోతాడు. జనాపవాదమునకు సహింపలేకపోతాడు. అత్యంత అనురాగంతో చూచుకుంటున్న సీతను, గర్భవతిని తిరిగి పరిత్యజించుటకు నిశ్చయిస్తాడు. వనప్రదేశములలోనే వదలి రమ్మని లక్ష్మణునికి అజ్ఞ యిచ్చాడు. సీతకు ఈ విషయమేమీ తెలియదు- తన కోర్కె ప్రకారం వన విహారానికి ఈ ఏర్పాట్లన్నీ జరుగుతున్నాయను కొంటుంది. శ్రీరాముడు ఆమెతో వెళ్ళడు. సౌమిత్రినిచ్చి పంపిస్తాడు- అతడు, సీతను, వాల్మీకి ఆశ్రమ ప్రాంతమున గల గంగ యొడ్డున దిగవిడిచి వెళ్ళిపోతాడు. కారడవిలో కారణం లేకుండా దిగవిడిచి వెళ్ళినందుకు సీత శోకిస్తుంది. అప్పుడే ప్రసవ వేదన కూడా ప్రారంభమవుతుంది. దుఃఖము వేదన, భర్తృ ఎవియోగ పరితాపము సహింప లేక భాగీరథి యందు పడిపోతుంది. ఆ నదీగర్భమునందే యిరువురి శిశువులను ప్రసవించడం ఆ బాగీరధీ మతల్లి ఈతల్లిని రక్షించి ఆ పిల్లలను కాపాడటం జరుగుతుంది. పాలు వదలిన పిమ్మట ఆ బాలకులను వాల్మీకి మహా మునికి అప్పగిస్తుంది.

అయోధ్యలో శ్రీరాముడు అశ్వమేధయాగాన్ని సంకల్పించి భార్యలేనందున బంగారుసీతను సృష్ఠంచుకొని యజ్ఞము ప్రారంభిస్తాడు. ఇంతలో, తలి దండ్రులుండగనే మృత్యువాత బడిన బ్రాహ్మణ కుమారునివార్తవిని, తన పరిపాలనలో దోషము వలనగాని ఇట్టి సంఘటన జరుగదని భావించి తద్దోష నివారణార్థమై వనప్రదేశమునకు బయలుదేరుతాడు. అరణ్యంలో శూద్రుడొకడు తపమొనరించుటచూచి వానిని సంహరించి దోష నివారణము చేయగలుగుతాడు. తాను ప్రవేశించినది దండకారణ్యమని తెలుసు కున్నప్పుడు పూర్వస్మృతులు జ్ఞప్తికిరాగా మిక్కిలి దుఃఖిస్తాడు. సమీపమునగల అగస్త్యాశ్రమానికి కూడా వెళ్ళుతాడు.

అగస్త్యుని ధర్మపత్నియైన లోపాముద్ర భాగీరథికి రామునిరాక తెలియచేస్తుంది. ఇతరులకంట బడకుండ సీతను తమస యను నదీ దేవతను తోడిచ్చి రాముడున్న వనప్రదేశానికి పంపిస్తుంధి. ఇక్కడే సీత పెంచినగున్న యేనుగును మదపు టేనుగు బాధించడం వన దేవతయైన వాసంతి రక్షణకొరకు ఆర్తనాదంచేయడం దానిని శ్రీరాముడు సంహరించి వాసంతిని కలుసుకోవడం జరిగింది. వాసంతి శ్రీరాముని గుర్తించింది, శ్రీరాముడు వాసంతిని తెలుసుకున్నాడు. సీత ఏమైనదని వాసంతి శ్రీరాముని అడుగుతుంది. ఘాతుక మృగములవాత బడియుంటుందని చెప్పి దుఃఖిస్తాడు. శోక పరవశుడై మూర్ఛ పోతాడు. ఇక్కడే అదృశ్యరూపంలో తమ సానమేతయై చూస్తున్న సీత, రాముని తన చేతితో స్పృశిస్తుంది. ఆ స్పర్శకు రాముడు మూర్ఛ నుండి తేరుకుంటాడు. వాసంతితో సీత దొరికినదనియు, ఇదిగో ఆమె చెయ్యి కొంచెము పట్టుకొనమనియు ప్రార్థిస్తాడు. తాను అవశుడై

యున్నాననియు ఆమె చేయిజారి పోవుచున్నదనియు, వాసంతిని పట్టుకొనమనియు బ్రతిమాలుతాడు. అదృశ్యమున వున్న సీతా తమసలను, వాసంతి చూడలేదు. ఆమెకు శ్రీరాముని ఈ వేడుకోలు అశ్చరాన్ని గొలుపుతుంది. సీతావియోగము వలన రామునికి చిత్తభ్రమ కలిగినదని భావిస్తుంది. వనదేవతయైనా న్యూన ప్రభావ అవటంచేత సీతను గాంచ లేకపోవటమే కాకుండా శ్రీరాముని ఆంతర్యం కూడా గ్రహించలేకపోతుంది. సీతా పరిత్యాగానికి జనాప వాదమని రాముడు చెప్పగా విని ఆతనిని దూషిస్తుంది. కఠిన భాషణలచేత ఆతని హృదయాన్ని మరింత గాయపరుస్తుంది.

శ్లో॥ త్వంజీవితం, త్వమసిమే హృదయం, ద్వితీయం
త్వంకౌముదీ నయనయోర మృతం, త్వమంగే
ఇత్యాభిః ప్రియ శతంర నురుధ్యముగ్ధాం
త్వామేవ శాంత మధవా కిము కితః పరేణ !

ముగ్ధయైన సీతను, నీవే జీవిత సర్వస్వమనీ, నయనోత్సవమగు వెన్నెలవనీ, రెండవ హృదయమనీ, ప్రియ భాషణములచే యిచ్చకములాడి తుదకు కారడవుల పాలు చేయడం న్యాయమేనా? కుసుమకోమలగాత్రియు, గర్భవతియు నగు ఇల్లాలిని కరుణమాలి ఇంత కఠినంగా పరిత్యజించడం, కారడవుల పాలు చేయడం ఏ ధర్మం అంగీకరిస్తుంది? అని దూషించి, దుఃఖాతిశయంతో మూర్ఛపోయింది. శ్రీరాముడు ఆమె దుఃఖోపశమనం చేసి, తన, ఆంతర్యాని ఈ విధంగా తెలియ చేస్తాడు:

శ్లో! దళిత హృదయం గాఢోద్విఘాతున భిద్యతే
వహతి వికలః కాయో మోహంనముంచతి
జ్వలయతి తనూ మంతర్దాహః కరోతి. నభస్మసా
త్ప్రహరతి విధర్మచ్ఛేదీ. నకృంతతి జీవితం।

హృదయము చీలినది. కాని పగులుటలేమ. బాధా వృతమై శరీరము మొద్దువారినది. కాని చైతన్యవిహీనముకాలేదు. విధి మర్మచ్ఛేదమగునట్లు కొట్టుచున్నాడు— కాని ప్రాణము తీయుటలేమ. ఇట్లున్నది నా స్థితి వాసంతీ యని వాపోయినాడు. అప్పుడు వాసంతి శ్రీరాముని నిజస్థితి తెలుసుకున్నది. రాజకార్య నిమగ్నుడైన శ్రీరామునకు సీతా వియోగ పరితాపాన్ని చెప్పుకొని దుఃఖించడానికే అవకాశం లేకపోయింది. అట్టిది. తన ప్రియురాలి అత్యంత ఆప్తురాలు, నెచ్చెలియైన వాసంతి సమక్షంలో శ్రీరాముని హృదయావేదన మనందరికీ అవగతమయింది. చక్రవర్తికి ఏకాంతముగా కూర్చుని శోకించటానికే క్షణం తీరిక ఉండదు. ఆ అవకాశాన్ని కవి కల్పించినది యిప్పుడే— ఇక్కడే. శ్రీరాముడు సీతను జనాపవాదానికి అడవిపాలు చేయటంలోని ఆంతర్యము కీర్తికాముకత్వముకాదు. రాముడు కీర్తి కాముడుకాడు. సీతా వియోగము అతనికి సహింపరానిదీ, భరింపలేనిది కూడా— అయినా ప్రజల కోసం ఎంతటి త్యాగాన్నైనా చేయగలిగిన వాడే ప్రభుడు. త్యాగశీలుడే ప్రభువుగా నుండుటకు అర్హుడు. శ్రీరాముడు అట్టి యుత్తమ ప్రభువు. శోకవహ్నిచేదహింప బడుదునని తెలిసియు జన వాక్యమునకు, తన అర్ధాంగియైన సీతను అడవులపాలు చేశాడు. సీతలేని రామునకు నిదుర ఎక్కడిదని వాసంతితో చెప్పుతాడు. సీతలేని రాముని వర్ణనం ఆమె సన్నిహితులకు దుఃఖాన్నే కలిగిస్తుందని వాసంతితో చెప్పి అయోధ్యకు వెళ్ళిపోతాడు.

ఈ దృశ్యాన్ని చూస్తున్న తమస, సీతలు కూడా రాముని దుఃఖమును గ్రహించి నిస్తుపోతారు. విచారిస్తారు, తరువాత పృథ్వీ, భాగీరథీ, వశిష్టారుంధతీ వాల్మీకులు సీతారాములకు పునస్సమాగమము చేకూరుస్తారనుకోండి. అయితే లఘు పరిచితయైన వాసంతి నిర్వహించిన ఈ చిన్ని సంఘటన ద్వారా మనకు రాముని మనోగతమైన దుఃఖ వహ్ని అవగతమైనది. అతని ఆంతర్యము బోధపడినది. రామచంద్రుడు త్యాగశీలుడని వ్యక్తమైనది కదా!

---

వచ్చే సంచికలో లఘుపరిచితలైన అనసూయ. ప్రియంవదల గురించిన వ్యాసం చదవండి

—సంపాదకురాలు

★

# పిల్లలమఱ్ఱి పినవీరన్న

శ్రీమతి దాసరి శారద; బి. ఏ.

పిల్లలమఱ్ఱి పినవీరన్న నియోగి బ్రాహ్మణుడు. గాదయామాత్యుడీతని తండ్రి, తల్లినాగాంబ. పినవీరభద్రుడు శృంగార శాకుంతలము, జైమినీ భారతము మొదలగు గ్రంథములను రచించి కీర్తిగడించెను.

పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుని గురించిన కథలు కొన్ని వాడుకలో నున్నవి. ఈతని గొప్ప మహిమ కలవాడని చెప్పుదురు. "వాణినారాణి" అని గర్వముగా చెప్పుకొన్న కవి మన పినవీరన్న, ఈతని మహిమలను గురించిన కథలను యీ వ్యాసములో ముచ్చటించెదను,

సాళ్వగుండ నరసరాజు తన కడనున్న కవులతో జైమినీ భారతము నెంత కాలమున కాంధ్రమున రచింతురనెనట. వారాఱుమాసములకు సంపూర్ణముగా రచింతుమనిరట. రాజు మూడు మాసములలో రచింపలేరా యనెనట. అంత పినవీరభద్రుడు మూడు మాసములేలా? ఒక మాసములో రచింతు ననెనట. అంతరాజు సంతసించి బహూకరించి యింటికి పంపెను. పినవీరన్న యింటికి వచ్చి ఆమాట మరచి దినములు గడుపుచుండెను. గడువింకను నాలుగు రోజులున్నదనగా గ్రంథమెంత వరకైనదో చూచిరమ్మని యొకని పంపెనట. వాడు వచ్చి పినవీరభద్రు నడుగగా రెండు దినములలో పూర్తియగునని చెప్పుమని యా మనుష్యుని పంపివేసెను. అంత వరకు వీరన్న ప్రారంభమే చేయలేదు. ఆ రాత్రి ప్రమిద నిండ నాముదము పోసివత్తి వెలిగించి ఒక గదిలో పెట్టి వట్టి తాటియాకుల పొత్తము గంటము నచటపెట్టి తలుపు బిగించి సరస్వతిని ధ్యానించి పినవీరన్న యచట బడి నిదుర పోయెను. సరస్వతి వచ్చి తెల్లవార్లూ గ్రంథము వ్రాయుచుండెను. పిన వీరన్న యన్నగారు పెద వీరన్న గదిలో గుబ్బక వినబడు చున్నది. గంటము చప్పుడు విన బడుచున్నది. తమ్ముడొకడే గదా గదిలో నున్నదని తలుపు బెజ్జములో నుండి లోనికి జూచెనట. బావ చూచు చుండెనని సరస్వతి సిగ్గుపడి యదృశ్య యయ్యెనట, ఆ గంటమువచ్చి కంటిలో గ్రుచ్చుకొనగా పెద వీరన్న కెవ్వున కేకవేసెను. ఆ ధ్వనికి నులికిపడి పినవీరన్నలేచి తలుపుదీసిసంగతి తెలిసికొని గంటముతో వ్రాయుచుండగా రాలిన తాటియాకు పొడినిఁదెచ్చి కంటికిఁ గట్టెనట. కొంచెము సేపటికే కన్ను బాగయ్యెనట. పినవీరభద్రుఁడు వ్రాసిన గ్రంథము చూచుకొని చివరి పద్యములు తాను వ్రాసికొని ఈ గ్రంథము ముగించి తీసికొనిపోయి సభలో రాజునకు జూపెను. రాజాశ్చర్యపడి యింత గ్రంథము యింత కొద్దికాలమున నెట్లు రచించితి వనగా "వాణి నా రాణియే" యనెనట. అమ్మాటకు సభలో గలకలము బయలు దేరెనట మఱల వీరన్న యిందుకేమి సందియము లేదనెనట. సభలో సాక్ష్యము సాక్ష్యమని యడిగిరట. అప్పుడాకాశవాణి "యథార్థమ్. ఇతఁడు చతురాననుని యవతార"మని పల్కెనట. దీనినిబట్టి పిన వీరభద్రుడు గొప్ప మహిమాన్వితుఁడని తెలుచున్నది.

మఱొక కథ :

పెదవీరన్న జపతపములు చేయుచు కాలక్షేపము చేయుచుండెనట. పిన వీరన్న జపతపముల జోలికిపోక వేశ్యల యిండ్లలో కాలము గడుపు చుండెడివాడట. పిన వీరన్న యన్నగారు పెదవీరన్న జపము చేసికొనుచు భార్యకు నగలు చేయించే విషయము ఆలోచించు చుండెనట, పిన వీరన్న అన్నగారేమి ఆలోచించు చుండిరో తెలిసి కొనెను. అంత ఎవరోవచ్చి "మీ అన్నగారేమి చేయుచున్నారు?" అని పినవీరన్నని యడుగగా "మా యన్న భార్య కాభరణము చేయించుట కాలోచించు చున్నాడ"ని తడుము కోకుండా సమాధానము చెప్పెనట. అన్నగారాలోచించు విషయమును పినవీరన్న యిట్టే పసి గట్టగలెను. దాసు ఆయనకు సాధ్యము కానిదేది?

పినవీర భద్రునికడ యోగ మహిమలు గలవందురు. ఒక పర్యాయము పెదవీరన్న శివపూజ చేసికొనుచుండ పినవీరన్న భోజనమునకు వచ్చెనట. అదిచూచి పెద వీరన్న తనకుఁగొంచె మవశిష్టముంట చేతను, ఈలోగా శివనివేదనము గాకుండా! వీరన్నము దినిపోవు నని యు భయపడి "ఓరీ తమ్ముడా! పిల్లవానిం జెఱువునకుఁగొని పోయి కడుపు లోపల వెలుపల శుభ్రముగాఁ దోమి స్నానము చేయించి తీసికొని రమ్మ"నెనట. వల్లెయని పిన వీరన్న పిల్లవానిం గొనిపోయి పొట్టచించి లోపల వెలుపలఁ గడగి వానిని స్నానము చేయించి యా పీనుగను బుజముపై వేసికొని యింటికిఁ దెచ్చెనట. ఇతని మహిమల నెఱింగిన వదినగారు భయపడక "అబ్బాయీ! పిల్లవాని నడిపించుకొని వచ్చి భుజించి పొం"డనెనఁట. పిన వీరభద్రుఁడు వెంటనే పిల్లవానిని బ్రదికించి నడిపించుకొనివెళ్ళి పాకశాలలో బాలునితో గలసి భుజించెనఁట.

# ఆంధ్ర మహిళ

శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి.

భరత దేశకీర్తి భాగ్యము భోగ్యము
నీదు భుజముమీద నిలచియుండె
నిన్ను నీవు నెరిగి నేర్పుగా మెలగుము .
అమలగుణవిశాల ! ఆంధ్రమహిళ !

మహిళ ఝాన్సిలక్ష్మి మాంచాల మొల్లమ్మ
డొక్క సీతమాంబ ! పెక్కువారు
భరత మహిళలంచు నెరుగుము నిక్కము
అమల గుణవిశాల ! ఆంధ్రమహిళ !

కర్మ వ్రాతయంచు కలవర పడకుము
చేయు పనులమీద క్షేమముండు .
పాడుపనులుచేయ పాపమే వచ్చును
అమలగుణ విశాల ! ఆంధ్రమహిళ

అన్న మిడెడివేళ అమ్మవు నీవమ్మ !
మంతనాలవేళ ! మంత్రివమ్మ
రాత్రివేళ నీవు రారాణి వగుదువు
అమలగుణ విశాల ! ఆంధ్రమహిళ

తల్లి చెల్లి వదిన తనయవు భార్యవు
నీవులేని చోటనేమి గలదు ?
మధుర మంజులమ్ము ! మగువగా జన్మింప
అమలగుణ విశాల ! ఆంధ్రమహిళ !

---

# మల్లెలరాణి

శ్రీ "భగవత్కుమార్"

బాబాయి తోటలో మల్లెపొదొకటుంది
మల్లెచెట్టుకుకలవు పది పసిమొగ్గలు
పది పసిమొగ్గలలోకలదు పెదమొగ్గ,
ఒక నాడు మేమంత తోటకెళ్లాము.

తోటలో పెదమొగ్గ బాగుగా విచ్చినది
బుల్లి మొగ్గలుకూడ కండ్లుతెరిచినవి
మల్లెలరాణి మరి పెద మల్లి పూవు.
మల్లెలరాణికి పసిమల్లెలే చెలులు,

కుసుమ బాలలత్రుంప చేతులాడక మేము
వెనుదిరిగివచ్చాము వట్టిచేతులతో.
నాటి రేతిరిపెద్ద ఉరుముల మెరుపులతో
పెద్ద వర్షముకురిసి పెనుగాలి వీచింది.

మల్లెలరాణి మరి మల్లెచెలు లందరు
ఏ మయినారో మరి ఎటులుండి నారో
అని మాదుగుండెలు కలతజెందినవి,
సూరుపురేఖలు విరిసి విరియకముందె

పరుగు పరుగున తోట లోపలకు పోయాము.
మల్లె పొదును చేరమరిచూస్తె ఏముంది !
వట్టి ఆకులతోడ వెల వెల బోయుంది.
మా ఆశలన్ని న్మురి అడియాశలై పోయె

తలలుక్రిందకు దించి కండ్లనీరొచ్చాయి,
పిల్లకాలువలోన మల్లె చెలియలమధ్య
పయనమై పోతుంది మల్లెల రాణి.

ఆ పయనమెచటికో !
దరిజేరుటెన్నడో

---

# ముద్దు

శ్రీ యలమాటి

ముద్దు చాలపవిత్రమైనది; చాల ఆ కర్షణీయ మైనది. ఇది వివిధా వస్థలందు వివిధరూపాలనందు తూంటుంది.

మాతృహృదయం చిరునవ్వులచిందిస్తూ చిందులు త్రొక్కే చిన్నారి పాపను ముద్దిడుకుంటూ, నిజ సౌందర్యం ప్రతిబింబించినట్లు హత్తుకొని ఆనందంలో ఓలలాడుతూ స్వర్గీయసౌందర్యాన్ని పొందుతుంది.

కాముకుడు శృంగార హాసవిలాసాల్లో మునిగి తేలుతూ ప్రేయసిని ముద్దిడి జన్మసార్ధకతకు అఱ్ఱులు చుస్తూంటాడు.

కవులు ముద్దును అనేక విధాల ముచ్చటించారు. ఒక సంస్కృతకవి ముద్దును మర్చిపోలేక "ఉచ్చైః సమర్పయ మదర్పిత చుంబనంచ" అని హెచ్చరించాడు. ఆ విధంగా ఆకవి ఆ ముద్దులో లౌకికానందాన్ని అనుభవించాడు.

మధురకవి నాళం కృష్ణరావుగారి హృదయం నవనీతం వంటిది. వారి భావనలో పాపాయి ఒక అందమైన పూవు. ముద్దుఅందలి కింజల్కము.

"కీట్సుఅండ్ షెల్లీ" రచనలలో ముద్దులు కన్పిస్తుంటవి. "షెల్లీ" రచనలలో స్వర్గీయచుంబనము హృదయ వికారమును. మానసిక దౌర్బల్యమును పోగొట్టి శాంతి సందేశమునిచ్చు అమరజ్యోతి.

కళా విశిష్టతను గుర్తించి సౌందర్యానుభూతిలో మైమరచి, ఆనంద లోలు డై రసవత్సమ్మేళనము నందు హృదయ వికాసమును ప్రతిబింబిస్తూ "కీట్సు" ముద్దును వర్ణించెను.

బ్రతికినంతకాలం ఆ సౌఖ్య చుంబనంలోనే జీవితాన్ని గడపగలనా అని "ఎమర్సన్" వెక్కి వెక్కి దుఃఖించాడు.

తనువా? అశాశ్వితం. యౌవనమా? ఫేనసదృశం. శరీరమా? రోగభూయిష్టం. కాని ఆస్వర్గీయ సౌందర్యమునకు ఆ అనురాగ విరాజిత చుంబనశక్తికి కాల పరిణామంలో ఏ మాత్రంపనిలేదు. "కోలరిజ్" అను వాడు ముద్దు స్వర్గీయ సౌందర్యమని చెప్పెను.

ప్రఖ్యాతయింగ్లీషు నాటకకర్తయగు "షేక్స్పియర్" ముద్దు ప్రేమముద్రయనెను.

పూర్వకాలంలో ముద్దును స్వాగత సూచకంగాను; బహిష్కరణ సూచకంగాను ఉపయోగించెడి వారు.

"బైబిలులో" ఎనిమిది రకాల ముద్దులు చెప్పబడినాయి. "అగస్టయిను" ముద్దును నాల్గు విధాలుగా భాగించాడు.

సౌందర్యమే ముద్దుకు ప్రధానకీలకం అని ఎక్కువ మంది అభిప్రాయం. "బైరన్" మానవ శక్తిని బట్టి చుంబనశక్తి మారుతుందనిచెప్పెను. "జాన్ బునియన్" అందంగావున్న వారినే ముద్దిడు కొనినదానిలో పవిత్రతలేదనెను.

పూర్వం రోమ్ దేశంలో పవిత్రతాచిహ్నంగా; వందన చిహ్నంగా ముద్దు పెట్టుకునేవారు. ముద్దు ఎవరి వలన ఎప్పుడు పుట్టిందో ఖచ్చితంగా చెప్పలేం.

పెదవులతో ముద్దిడుకోవడం శారీరక శక్తికి భంగమని శారీరక శాస్త్రజ్ఞులు నిరూపించారు. ముద్దు వలన స్త్రీ పురుషులందు విద్యుదుత్పత్తి జరిగి శారీరక శక్తి బలహీనత ఏర్పడు తుందట.

"హేస్టింగ్సు" కూతురు "రోలెనా" ముద్దును మొదట ఇంగ్లండులో ప్రారంభించిందని చెప్తారు. రోములో చచ్చిపోవుటకు సిద్ధంగావున్న వారిని ముద్దిడుతారు.

"సర్ వాల్టర్ స్కాట్" మిత్రుని ముద్దిడుతూ శాంతి పర్చాడు. "నెల్సన్" చనిపోయేటప్పుడు ప్రాణసఖుడు "హార్డిని" పిల్చి ముద్దిడెను. ఫ్రాన్సులో చేతులను, బుగ్గలను ముద్దిడు కుంటారు. కాని మనదేశంలో బుగ్గలను ముద్దిడుతారు.

చర్చిలలో వివాహానంతరం వధూవరులు ముద్దిడుకుంటారు. ముద్దు మూడువేలు రకాలగా వుందనుకోండి! ఏది ఏమైనా ముద్దు చాల పవిత్రమైంది; ఆకర్షణీయమైంది.

---

# ఖర (గాడిద) విలాపం

శ్రీ బి. వి. నరసింహారావు, బి.ఎ., బి.ఇడి.

ఇంతకూ నాదేమి పాపం
అంత నవ్వాయె నారూపం !
వింత పోకడగల జగతి కా
సింత కనికరమైన జూపదె!!

శిరము భారము
స్వరము ఘోరము
నడక, రూపము
కడు వికారము !!

ఆకతాయికి, అల్లరికి నా
తోక కొక టాటాకుగట్టి
ఏక సంతోషించు పిల్లల
మూకకేకీడు నే జేసితి ?!!

నీ చపరచుటకు మరి నిందకు
నేనెరవైతిని ఈ నరులకు
మూర్ఖ జనులను నాకు పోల్తురు
మూఢులను నా బిడ్డలందరు !!

బండ చాకిరికొరకు బట్టల
బరువుమూటలుమోయుకొరకును
నన్ను ఉపయోగించి అయినా
కున్న సహనము పరీక్షింతురు !!

గుర్రములపై స్వారిజేసే
గొప్పకేమో నోచుకొన నీ
కుర్రకుంకలు, బిచ్చగాండ్రూ
కోరి నన్నుపయోగ పరతురు !!

మాదుపాలను శిశువులకు ఓ
మందుగా తొలినాడు ఇత్తురు
ఎందుకొరకో తెలుసునా అది
వంద మేళ్లొనరించగలదట !!

కథలలో నసుగూర్చి మాత్రం
కవులు కొన్నైదొ వ్రాసినట్టివి
స్వార్థమునకే గుర్తుగాని, ప
రార్థమునకది గుర్తు రాదులె !!

నన్ను ఇట్టుల బాధ పెట్టే
నరునినైజమునే నెరుంగుదు,
కాని నాహృదిరేగు ఊహల
లోని బాధను అతడెరుంగడు.



# రాజకీయాలు

శ్రీమతి వారణాసి యశోదాదేవి

ఏప్రిల్ నెల ఆఖరి వారం నుండి మే మాసం చివరి వారం వరకు ప్రపంచంలో జరిగిన ముఖ్య సంఘటనలు— బుద్ధజయంతి ఉత్సవాలు, ఆసియా రాజ్యాల స్థితి, క్రొత్త పథకములు, భూకంపము, స్త్రీలకు ప్రత్యేక సౌకర్యాలు, స్పుట్నికులు, అణ్వస్త్రాలు, హైడ్రోజన్ బాంబుల అధిగమనం, విద్యా సమస్యలు, ఇండోనేసియా, ఆఫ్రికా రాజ్యాల మహోదయం, అల్జీరియా సమస్య, పాకిస్థాన్ దౌర్జన్యాలు, శిఖరాగ్ర సమావేశ మేర్పాటులు ఎగుమతులు దిగుమతులు, కాంగ్రెసు స్థితి, శ్రీ నెహ్రూజీ, ఆంధ్రాభ్యుదయం,

ఇటీవల టోకియోలో పునరుద్ధరింప బడిన ఒక పెద్ద బౌద్ధ స్తూపములో బుద్ధగయ, సారనాథ్, కుషి నగరం, లుంబినీవనం, సాంచీ మున్నగు బౌద్ధ క్షేత్రముల పవిత్ర మృత్తిక చేర్చ బడినది. 1956 లో బుద్ధజయంతి శత వార్షికోత్సవంలో ఒక టోకియో భారతీయుడు యీ మృత్తికను సేకరించెనట. టోకియోలోని యిండియా రాయబారి యీ నూతన స్తూపం, యిండియా, జపానుల ఆధ్యాత్మిక సంబంధమునకు చిహ్నమన్నారు. స్తూప ప్రారంభోత్సవంలో ప్రసంగిస్తూ.

బుద్ధజయంతి సందార్భంలో వాషింగ్టనులో 680సం॥ల నాటి బుద్ధ విగ్రహం ప్రతిష్ఠితమైనది; స్వర్ణ దినిపీఠముపై యమర్చబడినది. విగ్రహము తాయ్‌లాండ్‌నుండి సేకరింప బడినదట. దీని చుట్టుజ్యోతులు. దివ్వెలు గలవు.

### ఆసియారాజ్యాలస్థితి

ఆసియా రాజ్యాల నుండి విదేశ స్థావరములు తొలగింప బడనంత వరకు వాటి యార్థికవ్యవస్థ యభివృద్ధి జెందువరకు, ఆ దేశాల స్వతంత్రం సమగ్రము కాజాలదనిఅమెరికాలో యిండియారాయబారి జి. యల్. మెహతా ప్రకటించారు.

### క్రొత్తపథకములు

దండకారణ్య పథకం మొదటిదశలో 150 గ్రామములలో 18,000 కాందిశీకుల కుటుంబములకు పునరావాస సౌకర్యములు కల్పింప బడుననియు, 1 లక్ష 41 వేల ఎకరాల భూమి సాగుచేయ బడునని. కేంద్ర పునరావాస కల్పన మంత్రిత్వశాఖ ప్రకటించినది.

మద్రాసు, కలకత్తారేవుల యభివృద్ధి కార్యక్రమమునకు 20 కోట్ల అప్పుయిచ్చుటకు ప్రపంచబ్యాంకిఆమోదించింది.

వెనుక బడిన జాతుల యభివృద్ధిని గూర్చి కేంద్ర సంఘ సంక్షేమ బోర్డు యూనియన్‌హోం శాఖ సిద్ధపర్చిన పథకములను విలువ కట్టుటకు నియమితమైన సంఘము శ్రీరేణుకారాయ్ అధ్యక్షత క్రింద యేర్పాటైనది.

ద్వితీయ పంచవర్షప్రణాళికలో రైల్వేయభివృద్ధి పథకములన్నిటిని రైల్వే బోర్డు లాంఛనముగ ఆమోదించింది.

భూములులేని హరిజనులకు బంజరు భూములు పంచిపెట్టుటకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఒక పథకమును తయారు చేయుచున్నది.

తక్కువ రాబడి గల వర్గముల గృహ నిర్మాణ పథకము క్రింద కేంద్రపాలిత ప్రాంతమునకు, 13 రాష్ట్రములకు, 433, 90 లక్షల అప్పు మంజూరు ఐనది. అందులో ఆంధ్రప్రదేశ్‌కు 60 లక్షలు సాంక్షను యైనది.

తెలంగాణా ప్రాంతంలో 1558-59 లో 216 క్రొత్త బావులు నిర్మించుటకు, 142 పాత బావుల మరమ్మతుకు ఆంధ్రప్రభుత్వం 6,41 లక్షల రూ॥ మంజూరు చేసింది. ఆంధ్రలో 2293 బావుల నిర్మాణాన్కి 17,20 లక్షలు మంజూరు యైనది.

చేతి వృత్తుల యభివృద్ధికై ఆంధ్ర ప్రభుత్వం యీ యేడాది 5 లక్షలు ఖర్చు చేయ నిశ్చయించింది. రెండు లక్షల ఖర్చుతో హైదరాబాదులో అఖిల భారత చేతి

వృత్తుల బోర్డు అజమాయిషి క్రింద కేంద్రనమోనాల సంస్థ యేర్పాటు కానున్నది.

అన్య ప్రదేశములలో ఆధునిక సౌకర్యముల యేర్పాటుకై తూర్పు గోదావరి జిల్లాలో మారేమల్లి నుండి చింతూరుకు 34 మైళ్ల బోర్డు 1049 వేల ఖర్చుతో వేయుటకు నిశ్చయింప బడినది.

స్త్రీల సౌకర్యములు

కలకత్తా ఆఫీసులలోను, ఇతర సంస్థలలోను పని చేయుచున్న స్త్రీల కొరకై కలకత్తాకు ట్రాంవే కంపనీ వారు స్త్రీల స్పెషల్ నడుపుట యేర్పాటు చేసిరి.

స్ఫుట్నిక్ లు

రెండవ స్ఫుత్నిక్— అంటే సోవియట్ కృత్రిమవుప గ్రహం. అందులో చనిపోయి వున్న శునకము లైకా అమెరికా తూర్పు తీరానిక్కి యెదురుగావున్న ప్రాంతంలో యమిత వేగంతో పతనమై భగ్గున మండి బుగ్గియైపోయి నదట. ఇది దాదాపు 5 మాసములు పైగా అంతరిక్షంలో విహరించెను.

ఒకటిన్నర టన్నులు బరువుగల మూడవ స్ఫుట్నిక్ ను సోవియటు యూనియను మే 15 వ తేదీన అంతరిక్షము లోనికి పంపినది. ఇందులో కుక్కను పెట్టలేదు కాని టన్ను బరువు గల ఆయుధములు వుంచ బడినవి. ఈ మూడవ స్ఫుట్నిక్ 2 వ దానికంటె చిరకాలం అంతరిక్ష ములో విహరిస్తుందని రష్యను విజ్ఞాన వేత్తల నమ్మకం

అణ్వాస్త్రములు

అణుశక్తిని, అణ్వస్త్రములనుగురించి బ్రిటీషు శాస్త్ర జ్ఞులకు కావలసిన విషయములన్నిటిని అమెరికా వెల్లడి చేయుట కంగీకరించిన పక్షమున. బ్రిటన్ హైడ్రోజన్ బాంబుల పాటవ పరీక్షల విరమింప గలదని బ్రిటీషు ప్రధాని హెరాల్డుమాక్మిలన్ ప్రకటించిరి.

విద్యాసమస్యలు

పాఠ్యగ్రంధముల జాతీయకరణ పథకం ఆంధ్ర ప్రదేశ్ లో వచ్చే విద్యా సంవత్సరం నుండి యమలు జరుప బడును. చిన్న వుద్యోగములు డిగ్రీలులేనివారికి మాత్రమే యియ్యవలెనను పబ్లికు సర్వీస్ కమిషనుచే నియమితమైన వుద్యోగార్హతల కమిటీసూచనను ప్రభుత్వము పరిశీలించు చున్నదట.

లోక సభ అంచనాల సంఘం సెకండరీవిద్య పున ర్నిర్మాణ నిమిత్తమై అఖిల భారత సెకండరీ విద్యా విధాన సంఘమును ప్రత్యేక సంస్థగా రూపొందించ వలెనని సిఫార్సు చేసింది. దానికొక నిర్వహణ సంఘము, నిర్దిష్ట కార్యక్రమముగల సలహా సంఘము వుండవలెనన్నది. వారి సిఫార్సుల ననుసరించి సెకండరీ విద్యలో సమగ్ర మైన సంస్కరణలు ప్రవేశ పెట్టుటకు 30 యేండ్లు పట్టు నన్నారు వుస్మానియా విశ్వ విద్యాలయపు వైసు ఛాన్సలరు శ్రీ. డి. యస్. రెడ్డిగారు హైదరాబాదులో ప్రసంగిస్తూ.

ఇండోనేసియా కేంద్ర ప్రభుత్వమునకు వ్యతిరిక్తముగ పోరుటకు సుమత్రా విప్లవకారులు డబ్బిచ్చి విదేశ సాహసికులను కుదుర్చుకొనిరనియు, వారే దక్షిణ సెలిబస్ రాజధానిపై మకాస్సర్ విమానములో దాడి సల్పిరనియు, ఇండోనేసియా ప్రధాని భావిస్తున్నారు.

ఆఫ్రికారాజ్యాలు

ఆఫ్రికా ఖండము చిరకాలము పాశ్చాత్యులచే చీకటి ఖండముగా పేర్కొనబడినది. పాశ్చాత్యుల పాలనవలన ఆఫ్రికనులు సర్వవిధముల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతికాది వివిధ రంగములలో వెనుకబడి యుండిరి. ఇటీవల ఆఫ్రికాలోని స్వతంత్ర రాజ్యములు — యీజిప్టు యిథియోపియా, లైబీరీయా, లిబియా, మొరాకో, సూడాన్ టునీసియా, ఘనా — ప్రతినిధులు అక్రాలో ఘనా ప్రధాని డా. క్వామేన్క్రూమా అధ్యక్షత క్రింద సమావేశమైరి.

అగ్ర రాజ్యముల వివాదములలో చిక్కుకొనక యే కూటములోను చేరని విధానమును యనుసరించ వలె ననియు, వివిధ రూపములలోని కలోనియలిజమును, జాతి విచక్షణను నిరసించి ఇంపీరియ లిజమును గూర్చి హెచ్చరించిరి క్వామా, సభలో అంతర్జాతీయ విషయము లలో తమ సమైక్యతను కాపాడుకొని, ఆఫ్రికా ఖండంలోని పరాధీన ప్రజల సముద్ధరణకు సహాయ పడుటకు స్వతంత్ర రాజ్యాలు తీర్మానించెను, వలస రాజ్యవిధానము ఆఫ్రికా రాజ్యముల స్వాతంత్ర్య, భద్రతలకు ప్రపంచ శాంతికి కూడ భంగమని సభ తీర్మానించెను. అక్రా సమావేశం శాంతియుత సహజీవన సిద్ధాంతములో మిత్ర రాజ్య సమితి ప్రణాలిక లక్ష్యములలో అచంచల విశ్వాసం ప్రకటించినది. ఈ విధంగా ఆఫ్రికా జాతుల అక్రా సమావేశం ఆఫ్రికా చరిత్రలో నూతన శకారంభమును, ఆఫ్రికా ఖండ జాతుల మహోదయమును సూచించుచున్నది.

దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం శ్వేతేతరుల పట్ల ప్రదర్శించు చున్న జాతి విద్వేషము ఘోరము. మిత్ర రాజ్య సమితి యాదేశములను కూడ యీ ప్రభుత్వము తిరస్కరించినది ఇటీవల ఎన్నికలలో నెగ్గినదక్షిణాఫ్రికా ప్రధానిస్ట్రియిడాం తమ దేశములో జాతివిచక్షణ విధానమును మరింత తీవ్ర ముగఅమలుజరుపుమననిదుర్హంకారముతోప్రకటించారు.

అల్జీరియా సమస్య

కేవలం సైనిక చర్యలపై యాధారపడి, నాయకుల హతమార్చి, అల్జీరియా స్వాతంత్ర్య పుద్యమమును అణచ ప్రయత్నించుచున్నది ఫ్రాన్సు ప్రభుత్వము. మొరాకో, టునీషియాలను అల్జీరియానుండి వేరుచేసి వుత్తర ఆఫ్రికా సమాఖ్యను బలహీనంచేయ ఫ్రాన్సు యత్నమై యున్నది. టాంజీయర్‌లో సమావేశమైన మొరాకో, టునీసియా, అల్జిరియా ప్రతినిధులు అల్జిరియా సంపూర్ణ స్వాతంత్ర్యం పొందవలెనని తీర్మానించిరి. ఆక్రా సమావేశం ఫ్రెంచి సైన్యముల మరలింప ప్రభుత్వ మునకుహితవు గరపినది. ఐక్యరాజ్య సమతి యీ విషయంలో తను శ్రద్ధతీసుకో వలెను.

పాకిస్థాన్

తరచుగా పాక్‌సైనికుల కాల్పులకు గురియైన అస్సాం సరిహద్దులో శాంతిస్థాపనకు యేర్పాటుచేసిన ఒక్కరోజు లోగానే. 680 మైళ్ళు నిడివిగల అస్సాం సరిహద్దు కీలక ప్రాంతములలో పాకిస్థాన్ సైనికదళములు కేంద్రీకరింప బడినవి. కాశ్మీరు సమస్యపై తమ దేశంలోజరిగే ప్రదర్శ నములకు. ప్రచారమును నడపుట తమకు సాధ్యపడదని పాక్ ప్రభుత్వం భారత ప్రభుత్వమునకు తెలియజేసినది. మీదుమిక్కిలి లాహోరు బహిరంగసభలో వుపన్యసిస్తూ, పాక్, మాజీప్రధాని చౌదరి మహమ్మద్ ఆలీయిండి యాతో యుద్ధం అనివార్యమనిరి. పాకిస్థాన్ సాగిస్తున్న ప్రచారం చాల మందుదుడుకుగా వుందన్నారు నెహ్రూగారు రాజ్య సభలో,

శిఖరాగ్రసమావేశ యేర్పాటులు

శిఖరాగ్ర సమావేశం గూర్చి మాస్కోలో అగ్రరాజ్య చతుష్టయ దాయల సంభాషణలకు బ్రిటను, ఫ్రాన్సు, అమెరికాలు అంగీకరించిన పిమ్మట సమిష్టి సంభాషణ లకు సోవియట్ రష్యా నిరాకరించెను, యీసమాలోచన లలో మరికొన్ని రాజ్యములు పాల్గొనవలెనను సోవియటు ప్రతి పాదనపై మూడురాజ్యాలతో సంభాషణలు యారం భమైనవి; అగ్రరాజ్యత్రయ రాయబారులు యిందులకు సంసిద్ధులని సోవియటు విదేశాంగ మంత్రి గ్రోమికోకు తెలియ బర్చడమైనది. శిఖరాగ్ర సంభాషణల ఎజెండాలో తగు కట్టుబాట్లతో అంతర్జాతీయపర్యవేక్షణ క్రిందఆయుధ విసర్జన అమలు, అనగా నియమిత నిరాయుధీకరణ ప్రధానహంశముగ నుండువలెనని వుత్తర అట్లాంటిక్ రక్షణవ్యవస్థరాజ్యముల విదేశాంగమంత్రులు నిర్ణయించిరి.

ఎగుమతులు - దిగుమతులు

వీనిపై చెల్లించదగు సుంకములు, పన్నులు వీటిలో విశేషసౌకర్యములు కల్గించు కొనుటకు, ఇండియా, యిథియోపియాలు తోలివాణిజ్య ఒడంబడికపై సంతక ములు చేసెను.

1957 ఏప్రిల్ నుండి అక్టోబరువరకు ఆరునెలల్లో అమెరికా బ్రిటను, పశ్చిమ జర్మను, డెన్మార్కుదేశము లకు శాస్త్ర పరిశోధనకై 130,000 కోతులు ఎగుమతి చేయబడినవి. ఇందువల్ల 86 లక్షల రూ. విదేశ ద్రవ్య ఆర్జన జరిగింది.

కాంగ్రెసు సమస్యలు

అఖిలభారత కాంగ్రెసు సంస్థయొక్క ప్రతిష్ట, పటు త్వము, పరపతియు, కాంగ్రెసు వాదులలో కార్యదీక్ష, కార్యశూరత, కార్యతత్పరత స్వరాజ్యసిద్ధికి పిమ్మట సన్నగిలిన వన్నభావము దేశమున తలచూపినది. అనేక కారణములవల్ల కొన్ని రాష్ట్రములలో బై ఎలక్షన్సు, కార్పరేషను, రాజ్యసభ ఎన్నికలలో కాంగ్రెసు ప్రజాద రణ గోల్పోయినది. దేవికొలం బై ఎలక్షనులో దెబ్బ తిన్నది,

ఇటీవల మద్రాసులో కాంగ్రెసు అధ్యక్షులు ప్రసం గిస్తూ కాంగ్రెసు సంస్థను శక్తివంతం చేయుటలో క్రమ శిక్షణ కాంగ్రెసు సిద్ధాంతములను, సాంప్రదాయములను కాంగ్రెసు వాదులు సరిగా అవగాహన చేసికొనునట్లు వారికి శిక్షణ యిచ్చుట యొకముఖ్య సమస్య యన్నారు. ఢిల్లీలో కాంగ్రెసు అధ్యక్షులు, కార్యదర్శులసమావేశంలో దేశంలో స్వాతంత్ర్యసమరపు రోజులలోవలె కాంగ్రెసు వాదులందరు ప్రజలతో సన్నిహిత సంబంధము కల్గియుం డవలెనని హెచ్చరించింది. ప్రధాని నెహ్రూ ప్రసం గిస్తూ, దేశం మొత్తముమీద రాజకీయ, నైతిక ప్రమాణ ములు కొంతసడలిన వనియు, కాంగ్రెసు వాదులు ఆత్మ పరిశీలన చేసుకొనవలెననియు, అనైక్యతను, క్రమశిక్షణా రాహిత్యమును యరికట్టి సంస్థను పటుతరం చేయవలె ననియు నైతిక ప్రమాణముల పునరుద్ధరించి కాంగ్రెసున

ప్రజాదరణ పొందునట్లు చేయవలెనన్నారు. కాంగ్రెసు పార్లమెంటరీ ప్రోగ్రాముతో తృప్తిచెందక, ప్రాథమిక సూత్రములను, లక్ష్యములను పాటించిన ప్రజాదరణ చూరగొనుట నిక్కువము. వున్నత లక్ష్యములు, వుత్తమ సంప్రదాయములు, పలుకుబడి. చైతన్యముగల ఒక్క గాంగ్రెసుకే పునరుజ్జీవన శక్తిగలదు.

ప్రధాని నెహ్రూ

దేశంలో కొందరు నెహ్రూజీ ప్రధాన పదవిని వదలి జాతీయ నాయకత్వం వహించి దేశసేవ చేస్తే బాగుండు నని యభిప్రాయాలు వెలిబుచ్చిరి. నెహ్రూగారు కన్నూరు ప్రసంగంలో తన శపథం పూర్తియగు వరకు పదవినుండి విరమింప జాలనన్నారు. కొన్నేండ్లుగ కాంగ్రెసు వాదులు స్వార్థప్రేరేపితులుగ నుండవచ్చును, కాని స్వరాజ్యము సిద్ధించిన పిమ్మటకూడ కాంగ్రెసు చరిత్రాత్మకమైన పాత్రను నిర్వహిస్తున్నదని ప్రధానియుద్బోధ నలుబది కోట్ల భారత ప్రజలను యెదుర్కొను చున్న సమస్యలన్నియు పరిష్కార మగువరకు తనకు విరమణ లేదని వారి ప్రతిజ్ఞ. నలుబదిసంవత్సరములనుండి తాను ప్రజలతో కలిసి భారతదేశ సమస్యలలో, భారత ప్రజల కష్టసుఖములలో భాగస్వామియై తన వ్యక్తిత్వమును గోల్పోయితిననియు, కోట్లకొలది ప్రజలకు సంబంధించిన సమస్యల పరిష్కారమునకు పూర్వమే తానుప్రజలనుండి విడిపడి అన్యవిషయములపై శ్రద్ధవహింప లేననియు నెహ్రూజీ వక్కాణించారు. ఆ పలుకులలో వారి ప్రజానురాగము, సేవాపరాయణత్వము, సామాన్యజనానీకంతో తాదాత్మ్యం ప్రస్ఫుటమౌతున్నవి.

రాజకీయ స్వాతంత్ర్యము ఆర్థిక, సాంఘిక అభ్యుదయమునకు, సమతా సిద్ధాంతముపై నాధారపడిన నవ సమాజ నిర్మాణమునకు దారితీసి నప్పుడే భారత మహోదయసిద్ధి గాగలదు. ప్రధానినెహ్రూ ప్రతిన నెరవేరగలదు అప్పటివరకు వారికి విశ్రాంతి మిథ్య. కొంతకాలం పదవీ బాధ్యతలనుండి తప్పుకొని సామాన్య పౌరుడుగా సమస్త విషయములు ఆలోచించుటకు పార్లమెంటరీ పార్టీ అనుమతి కోరారు నెహ్రూజీ. ప్రసిడెంటుకు తెలియజేశారు, తుదినిర్ణయం పార్టీదేనన్నారు. చివరకు ప్రజల, కాంగ్రెసు పార్లమెంటరీ సభ్యుల కోరికపై నెహ్రూ తన నిర్ణయం మార్చుకొన్నారు. పదిరోజుల సెలవుమీద మే 20 తేదీన ప్రధాని నెహ్రూ కాంగ్రెసు రాజధాని ఢిల్లీవదలి కూలూలోయచేరి, విశ్రమించు చున్నారట.

ఆంధ్రాభ్యుదయం

సౌదీ అరేబియా రాజధాని రియాధ్‌లో నిర్మింపనున్న విశ్వవిద్యాలయ భవనపు ప్లానుకు ఆంధ్ర వాస్తుశాస్త్ర నిపుణుడైన ఫయాజుద్దీన్‌కు 8000 రూ బహుమతి వచ్చింది. వీరు ఆంధ్ర ప్రదేశ్‌కు ఛీప్‌టౌను ప్లానింగు అఫీసరు. బహుమతులు పొందిన తక్కిన వాస్తుశాస్త్రజ్ఞులు యీజిప్టు అమెరికా సిరియా, హాలెండు దేశీయులు.

భారత నౌకాదళాధిపతిగ నియమింపబడిన అడ్మిరల్ రామదాసు కతారి యాంధ్రుడగుట ఆంధ్రులకు ముదావహము. ఈ నియామకముతో భారతనౌకాదళ చరిత్రలో నూతన శకారంభమైనది. కతారి యేరాష్ట్రీయుడైన భారత రత్నములలో నొకరన్నారు పండిట్ నెహ్రూ.

ఆంధ్ర రాజధాని హైదరాబాదును శోభాయమానంగా చేసి తీర్చి దిద్దుటకు వీలుగా సమగ్రపథకమును తయారు చేయించుటకు ఆంధ్ర ప్రభుత్వము 6 లక్షలు మంజూరు చేయనున్నది.

అజంతా కేంద్రాన్ని మరింత ఆకర్షణీయంగ చేయుటకు, గుహల సమీపమున చందన వృక్షములతోటవేయుటకు కొంచెం దూరంగా వాఘిరా నదీతీరపు పొడవునా వుద్యానవనములు వేయుటకు పురాతత్వశాఖవారు పథకములు సిద్ధము చేసిరి. వాఘిరానది గట్టునుంచి నది మధ్య గలగుట్టపైకి మైలు పొడవున తీగెల వంతెన నిర్మింపబడినది. ఈ గుట్టమీదినుండి 1819 లో బ్రిటీషు వేటగాండ్రజట్టు అజంతా గుహల మొదటగుర్తించిరి.




# రాణి రుద్రమ భర్త....!

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

"ఏం ఇలావచ్చావు ?" అన్నాను గడబడలాడుతూ వచ్చిన నెచ్చెలి జానకితో,

"కొంపముంచావు" అని కూలబడ్డది కుర్చీలో.

"కొంపముంచానా ?" అని తెల్లబోయి సంభాళించుకొని "అది మాకు అలవాటులేదే" అన్నాను దర్జాగా.

"నీకది అలవాటో పొరపాటో నాకది గ్రహపాటైంది"

"అసలు సంగతి చెప్పకుండా ఏమిటీ మేళాము" న్నాను విసుగ్గా.

"రోలొచ్చి డోలుతో చెప్పుకుంటే మేళాము కాదూ"

"అవుతుందనే అనుకోవాలి"

"నీకేమి నాకు ప్రాణ సంకటము, నీకు పరిహాసము."

"ప్రాణసంకటాలన్నీ పరిహాసముచేసి కష్టాలన్నీ సుఖాలుగా మార్చ జోవటమే మా అలవాట" న్నాను ఏక చ్ఛత్రాధి పతి దర్జాతో.

"అసలదే నీకున్నరోగము" అన్నది బుంగ మూతి పెట్టుతూ జానకి.

"అమ్మాయి ! మాటలు జాగ్రత్తగా రానీయి. రోగము, గీగము అన్నావంటే చూడు" దగ్గరే వున్న టెన్నిసురెకెటు ఎత్తబోయి, చేతులోవున్న చేతిగుడ్డ జానకి ముఖము మీద వేసి నేను తాపీగా కుర్చీలో కూర్చుని ఈనెల సంపాదకీయము వ్రాసు కుంటున్నాను. నాకు సాధారణంగా కోపము, ఏ ఎడాదికో రెండు సార్లు వస్తుంది. వస్తే మాత్రము ఆరునెల్లకు గానిపోదు. ఇప్పుడట్టిదే వచ్చిన దని పసిగట్టి గాబోలు జానికి సవినయంగా, మృదు మధుర హావభావాలతో

"అయితే చెప్పుతా నుండు" అన్నది.

"చెప్పకపోతే పో" అన్నాను,

"చెప్పుతానంటే చెప్పకపోతే పో అంటావేమిటి"

"సరే నీ యిష్టము"

"నేను, మా ఆయన పోట్లాడు కున్నాము"

"మంచి పనిచేశావు"

"నీ కన్నీ వేళాకోళము"

"నాకన్నీ వేళాకోళముగాదు. ఎవరైనా ఒక పెళ్ళాము తన మొగుడుతో పోట్లాడుకుంటేగాని వైసీవర్సా అయితేగాని అందరికీ వేళాకోళమే"

"అయితే నేను దానికెట్లా బాధ్యురాలని" ?

"నీ మొగుడ్నడుగు"

"నిన్నడుగు దామనివస్తే"

"వస్తే వెళ్లు"

"వచ్చానా ! అడిగ్గానివెళ్ళను"

"అడిగావుగా మరి వెళ్లు"

"అసల్ది అడగండే"

"ఇప్పుడిదంతా కొసరుదేనా ? కానియ్యి అసలు దేమిటో"

"అసలు మా యిద్దరి మధ్యా పోట్లాటకి నీవే కారణము" గదిమూల చీపురుకట్టగాని, రోకలిగాని వున్నదానిచూచాను. ఈదినము జానకికి పోట్లాడుకునే యోగమేగాని, దెబ్బలుతినే యోగము లేదేమో రెండూ కనబడలేదు.

"అసలు నీ మొగుడు ఎట్లాటి వాడో ఏనాడు చూడలేదు. మీపోట్లాటలకు నేను కారణమేమిటి" అన్నాను ఉద్రుతంగా కుర్చిలోనుంచి నిలబడి. వ్రాస్తున్న కాగితాన్ని చింపిన ఆవేశ భావాన్ని గ్రహించి జానకి జాగ్రత్తగానే నసిగింది

"అదిగో ఆ వ్రాతలే కారణము"

"నేను వ్రాసుకుంటే మీ అయనకేమి దొచ్చిందోయి"

"నేను నీకేదో చెప్పి వ్రాయించానని ఆయన ఉద్దేశము"

"అంతే నీ వంటి తెలివిగల భార్యా మణులు మాకు చెప్పకపోతే వ్రాయలేమనా ఆయన ఉద్దేశము ?"

"అదికాదు. నీవు నేను స్నేహితులమా"

"అయితే. ఏం ? ఆయనకది ప్రాణాంతకంగా వుందా" ?

"ఉ, అదే మరి."

"అయితే మానెయ్యి"

"మానేస్తాలే. మొన్న... పత్రికలో వ్రాశావే భార్యలు భర్తలవద్ద కారు డ్రయువింగు నేర్చుకో వద్దని, అదేమో మా ఆయన చదివి నామీద దూర్వాస మునెల్లే లేచారు. నేను నీతో ఆయన కారు డ్రయివింగు నేర్పేటప్పుడు పడ్డ అగచాట్లన్నీ చెప్పానట. నీవేమో అవన్ని పత్రికకు ఎక్కించావట. తనకది చాలా అప్రతిష్టట. నన్నెందుకు చెప్పావని నానా మాటలు అన్నారు"

"అయితే నీవునాతో చెప్పావా ఆ సంగతులు లన్నీ ?"

"నే చెప్పుడుచెప్పాను ?"

"మరోసంగతి ఆయనకు చెప్పలేకపోయావు ? "

"చెప్పితే నమ్మితేగా ?"

"అసలీ జాతికున్న రోగమే అది. రవిగాననివి, కవి గాంచునన్నది మీ ఆయనకు తెలియకపోతే నీవుచెప్పు. గుమ్మడికాయల దొంగెవడురా అంటే బుజాలు తడువు కున్నాడట వెనక ఒకడు లోకంలో నీవు, నీ భర్త లాంటి సతీపతులు ఏకైక దంపతులు అందరూ మన లాంటివాళ్లే, అందరికీ మనలాంటి సమస్యలే. అంద రము మనుష్య మాత్రులమే మానవనైజము అంతా "అంతే"

"క్రిందటిసారి బావమరదుల సంగతి వ్రాసావు. ఈ సారి కారు డ్రయివింగు సంగతి వ్రాసావు రెండు మా ఆయన్ని గురించి నేను నీకుచెప్తే నీవు వ్రాస్తున్నావని ఆయనభ్రమ"

"నీవు నాకు చెప్పలేదు, మీ ఆయన సంగతి వ్రాయ లేదు. దీన్నిబట్టి తేలిందేమిటంటే, ఈ నా రచనలు సహజంగా వున్న వన్నమాట, ఆ క్రెడిటు మీ అయన నాకు ఇండయిరెక్టుగా ఇచ్చినందుకు కృతజ్ఞురాలను. కాని ఇప్పుడు నీ వ్యవహారానికి నే చెప్ప దలచు కొన్నది. ఒక్కటే మాట ఇంటింటా ఒక పొయ్యి మనింట్లో ఒక్కపొయ్యి- కాబట్టి గుమ్మడి కాయల దొంగంటే బుజాలు తడువుకో వద్దని నీ ప్రాణనాథుడ్ని వేడుకో"

"ఆ ఈ మాటలు నేనెంత సరసంగా చెప్పినా అవి విరసంగానే మారుతవి"

"అది నీ ఖర్మ"

"సరె ఖర్మకు ఏంచేస్తాము...." ఆ ఘనఖర్మ వంద్యమేకదా నాకేదిదారి. నన్ను రెట్టించి రెట్టించి ఇంటి గుట్టు బయట పెట్టానని అంటుంటే..." కళ్ల నీళ్ల పర్యంతమై దీనంగా అడిగింది.

"గోదారే"

"అదికాదు లక్ష్మి. నేను చెప్పినవేవీ ఆయన నమ్మ టములేదు, నా విషయము, మన విషయము ఆమెతో నీ వెందుకుచెప్పావు అని రెట్టించి రెట్టించి అడిగితే నేనేమి చెప్పేది. నీవు వ్రాసేవన్నీ నేను చెప్పేమాట అని ఆధారము చేసుకునేనని ఆయన అనుమానము."

"అయితే మాయింటికి నీవసలురావద్దు, నా నేస్తము మానెయ్యి. అది ఉభయులకు మంచిది.

"నేను నీ యింటికి రావటము లేదని చెప్పిన తరు వాత నీవు ఇట్లాంటి కథో, వ్యాసమో ఏదో వ్రాస్తే అప్పుడు మళ్లీ నేను నీకు రహస్యంగాచెప్పాననిఅనరూ"

"బాగుంది వరస. అసలు అనుమానాలుంటే అవి పెను భూతాలై కూర్చుంటవి. జీవిత సమస్యలను గురించి వ్రాసేటప్పుడు. ఏ కవైనా రచయిత్రైనా దేన్నిగురించి వ్రాస్తారు? నిత్య జీవితములో ఎక్కువ చిక్కులతో నిండుకున్న రమ్యమైనకథా వస్తువు దాంపత్యము. ఆ తరువాత అత్త కోడళ్ల జగడాలు అల్లుళ్ల అలకలు. పిల్లల చిలిపితనాలు, కాబట్టి పత్రికల్లో వ్రాసే కథలలో పాత్రలన్నీ తామే ననుకొని అపోహ పడి, ఒంటికాలుమీద కయ్యానికి లేవటమేమి సబబు?"

"పాపమాయన నిన్నేమి అనలేదులే."

"అబ్బఎంత జాలిగలదానవు. పాపము ఆయన్నేమి మనమూ అనలేదులే"

"నీ వన్నావనికాదు. నీవు మనస్సు నొచ్చుకుంటు న్నావని అన్నానుకాని"

"ఇదిగో, కానిలేదు. దమ్మిడిలేదు. నాకు నీవన్నా ఏమిభయములేదు. నీ మొగుడన్నా దిగులులేదు. చిన్నప్పుడు మనము స్కూల్లో డిబెటులో కత్తాకల మాని వాదోపవాదాలుచేసుకున్నాము జ్ఞాపక ముందా? నేను నా జీవితములో సాధించ గలిగింది ఈ కలముతోనే సాధించ దలచాను. ఈకలము అసత్యము వ్రాయదు. నాకింక భయమేమున్నది. ఎవరో కష్ట పడతారని మాను కుంటానా? నేవ్రాసిన వాటిలో అధర్మముగాని అసత్యముగాని అశ్లీలముగానిలేదు కదా! ఏ మంటావు"?

"లేదనుకో. కాని ఎప్పుడూ మగవారి మీదకుదాడి తీస్తుంటే వారందరూ నీకు శతృవులే అవుతారుగా"

"అదా నీ భయము. నాకదేమి భయములేదు. శతృవులై ఏమి చేస్తారునన్ను? ధర్మము ఎక్కడుంటే అక్కడ జయము తప్పదు."

"అయితే నేను వెళ్లుతా. నాకేదో ఉపాయము చెప్పు"

"ఇదిగో నా సలహా ఇందాకే చెప్పాను. ఉపా యాలు గిపాయలు ఎరిగిన దాననుకాదు. అనదలచు కున్నది. చెప్పదలచుకున్నది కుండ పగలేసినట్లు అన టమూ. చెయ్యటమే నావంతు"

"అయితే మరి...."

"చూడు. ఈచిక్కు నీ కొక్కదానికే వచ్చిపడ్డ దేమికాదు. మన జాతికి ఏ నాటినుంచో వున్న రోగమే అది. అలనాడు రాణీ రుద్రమకు తప్పలేదు ఈ గొడవ ఈవేళ ఇంటిగుట్టు ఎందుకు బైటపెట్టావని రెట్టించితే రేపు రెట్టించటానికి ఇంకొకటేదో దొరకకపోదు, అథవా ఆతీరు తప్పితే అసలు ఇంటి సంగతి, ఇల్లాలు సంగతి. పట్టించుకోకుండా వుండటము మన ఆంధ్రుల ప్రత్యేక లక్షణము- ఈ లక్షణాలు వాటంతటవేమి చెడ్డవి కాకపోయినా ఆంధ్రమహిళలకు ప్రాణసంకట ముగానే తయారవుతున్నవి"

"అంతేలే నీవు చెప్పినట్లు రాణీ రుద్రమకే తప్ప నివి మనకెక్కడ తప్పుతవి?"

"మరి వెళ్లొస్తావా"

"ఆ చాలా సేపయింది నేనొచ్చి. మావారు ఆఫీసు నుంచీ వచ్చేటైమ్ అయింది, వెళ్లొస్తా"

"నీవు మా యింటికి రావటము మానేస్తె మరీ మంచిది"

"ప్రయత్నముచేస్తా. అది అంతసులభంగా సాధ్య మయేపనికాదు"

"అమ్మయ్య" అనుకుని పడక కుర్చీలోకి వాలాను.

"రుద్రమ్మ భుజశక్తి...." అని చెవులో గింగురు మన్నవి.

# ఆహుతి

*** శ్రీమతి చిట్టూరి అన్నపూర్ణాదేవి ***

స్త్రీ హృదయం వేడికన్నీటికి కరిగిపోతుంది. తల్లి లేని పిల్లలపట్ల కన్నీరు కార్చి తన ఒడిలోకి తీసుకుంటుంది.

కాని...పురుషుడు ఎప్పుడు దానవుడికంటె భయంకరంగాను, పశువుకంటే హీనంగాను ప్రవర్తిస్తాడో చెప్పలేం!

---

"నేను చెప్పినమాట విను భద్రం" అన్నాడు అనంతరావు జబ్బుతో పడివున్న స్నేహితునితో. "ఏం వినమంటావు? ఎలా వినమంటావు అనంతం?" అన్నాడు హీనస్వరంతో భద్రం.

"నేను చెప్పినమాట విను భద్రం నీ తరువాత ఏమౌతుందో ఆలోచించండి. పిల్లలు, రాధమ్మ ఒక్తి అమాయకురాలు ఈడు వచ్చిన సరితగతి ఏమవుతుంది?" అన్నాడు గంభీరంగా,

"అందుకని ఈడూ జోడూ చూడకుండ పదహారేళ్ళ పిల్లను నలభయ్యేళ్ల వాడికిచ్చి కట్టమంటావా? ఇదే నీకూతురైతే అలా అంటావా?" అన్నాడు ఆవేశంలో. అనంతరావు శాంతంగా "నీవామాట అంటావని నాకు తెలుసు కాని ఏంచేయను, కష్టాలపాలు కాబోతున్న నీ కుటుంబాన్ని చూచి ఊరుకోలేక పోతున్నాను. వయస్సు పెద్దదే కాని రఘునాథ్ చాలా మంచివాడు. మర్యాదస్తుడును" అన్నాడు.

"నిజమే కావచ్చునుకాని తరువాత ఎవరెలా మారుతారో ఏంచెప్పగలం అనంతం?" అన్నాడు.

"ఎవరిఖర్మ ఎలావుంటే అలా జరుగుతుంది. మనం చేసేది వారిక్షేమాన్ని ఆలోచించే చేస్తాం!" అన్నాడు.

"అంతేనంటావా అనంతం?"

"అనంతం బాబాయి చెప్పినట్లే చేయండి నాన్నా" అంది అప్పటి వరకు తలుపుదగ్గర నిలబడి సంగతంతా విన్న సరిత లోపలికివచ్చి.

"సరితా! ఆలోచించే అంటున్నావా తల్లీ?"

"అనంతం బాబాయి కంటె మనకు ఆప్తులెవరునాన్నా నన్ను తన బిడ్డకంటె ఎక్కువగా చూచాడు. ఈ నాడు ఈమాట చెపుతున్నాడంటే మన క్షేమం కోరేనాన్నా!" అంది మంచంమీద తండ్రి పక్కనెకూర్చుంటూ.

"అవునుతల్లీ నీవన్నమాట అక్షరాలనిజమే. అనంతం నా సొంత సోదరుడిగానే తలంచు తున్నాను. అతను చెప్పినట్లు చేయడమే మంచిదమ్మా!" అన్నాడు తండ్రి ఆయాసపడుతు. అనంతం పైకండువాతో కళ్ళు తుడుచు కుంటు "భద్రం ఈ లోజునాకు చాలా ఆనందంగావుంది వస్తాను" అంటూ లేచాడు. వెనుకే సరితకూడా వెళ్ళింది. "నీ త్యాగానికి చాలా సంతోషిస్తున్నానమ్మా!" అన్నాడు అనంతరావు సరిత తలనిమురుతూ.

"నీవు నేర్పిన విద్యేగా బాబాయి?" అంది సరిత వినయంగా.

♦ ♦ ♦

"సరితా! అశోక్ వచ్చాడు" అన్నాడు రఘునాథ్ వంట ఇంటిలో కాఫీ కలుపుతున్న భార్యదగ్గరకొచ్చి.

"అబ్బాయి వచ్చాడా?" అంటూ హాల్లోకి నడిచింది సరిత. అప్పటికే లోపలకువచ్చిన అశోక్ సరితనుచూస్తూ ఏమని పలుకరించాలో తోచక చూస్తూ నిలబడిపోయాడు సరితకూడా అదేస్థితిలోవుంది. అదిగమనించిన రఘునాథ్

"సరితా! వీడు మన అబ్బాయి అశోక్"

"అశోక్! యీమె మీ పిన్ని సరిత. నమస్కరించి ఆశీస్సులు తీసికోనాయనా!" అన్నాడు,

అశోక్ చిరునవ్వుతోవంగి సరిత పాదాలకు నమస్కరించాడు. సరిత హృదయంలో వాత్సల్య సాగరం

ఉప్పొంగింది. అప్రయత్నంగా ఆమెచెయ్యి అశోక్ తలను నిమిరింది.

సరితా అశోక్‌లు దాదాపు ఒకే వయసు వారు. కాని వారి స్థానాలు మాత్రం భిన్నాలు. ఆమె స్థానం మాతృ పీఠం, అతడు ఆమె కుమారుడు. తల్లి ప్రేమ ఎరుగని అశోక్ తండ్రి పెంపకంలో పెరిగి పెద్దవాడయి డాక్టరు చదువుకు వచ్చాడు కుమారుని గొప్ప డాక్టరు చేయాలని ఆశించిన రఘునాథ్ ఆశను కొనసాగిస్తున్నాడు అశోక్. స్నేహితుల బలవంతమున అయితేనేమి మనసులోని ముక్కువచేతనేమి ఇంతకాలానికి రెండవ వివాహం చేసు కున్నాడు రఘునాథ్.

"నాయనా ! అశోక్ ఇంత ప్రొద్దు పోయేవరకు చది వితే ఆరోగ్యం పాడవదూ?" అన్న సరిత మృదువైన మందలింపు చెవిని పడ్డది. పుస్తకం మూసేశాడు. కుర్చీ లోనుండిలేచి "ఇక చదవనండీ, నిద్రపోతాను" అన్నాడు తాను తేచ్చిన పాల గ్లాసును అందిస్తూ "ఒక్క మాట అడగనా అశోక్ !" అంది.

"అడగండి !" అన్నాడు వినయంగా,

"అయితే నేను నీకు అమ్మనేనా?" ఆ ప్రశ్నతో అశోక్ చాలా గాబరాపడ్డాడు. ఆశ్చర్యం కూడా కలిగింది. కాని శాంతంగా" అంతకంటే ఎక్కువనే భావిస్తున్నాను తల్లి ప్రేమంటే ఏమిటో ఎరుగను. కాని మీరు వచ్చిన దగ్గరనుండి, తల్లి లభించినట్లయింది మీ ఆదరణ, వాత్సల్యం నిజంగా మరువగలనా? అయినా ఎందుకలా ప్రశ్నించారు. నేనేమయినా పొరపాటు చేశానా ?"

"అవును పెద్ద పొరపాటే చేస్తున్నావు" అంది గంభీ రంగా. అశోక్ హృదయాన్ని శోకంఆవరించింది. గుండె పగిలినట్లయింది. ఆమె వంక ప్రశ్నాత్మకంగా చూచాడు. అతని కండ్లు "ఏం తప్పుచేశాను?" అని అడుగుతున్నట్లు జాలిగా వున్నాయి.

"తల్లి నెవరైనా "మీరు" అంటారా?" అంది చిరు నవ్వుతో. అశోక్‌కు ఒక్కసారి భూమిమీద నుండి ఆకా శంలోనికి ఎగిరినట్లయింది. ఏమనాలో తెలియలేదు. అప రాధం చేసిన వాడిలాగ నిలబడి పోయాడు.

"ఇక ముందు నన్ను "ఏమండీ" అనకూడదు"

"అయితే ఏమనమంటావు?" అని అతని కండ్లు ఆమెను ప్రశ్నించాయి. ఆమె ఆదరణతో "అమ్మా!"అని పిలవాలి అంది. అశోక్ హృదయంలో ఆనందం చిందు లువేసింది. ఉద్రేకంలో "అమ్మా !" అన్నాడు ఆమె మురిసిపోయింది,

"ఇక పడుకో వస్తాను" అంటూ వెళ్ళి పోయింది. ఆమె వెళ్ళినవైపే చూస్తూ తన్మయంతో నిలబడిపోయాడు అశోక్.

అసలు స్త్రీ హృదయం మంచుగడ్డ వంటిది. వేడి కన్నీటికి కరిగిపోతుంది. స్త్రీ మూర్తీభవించిన త్యాగం. ఆమె, సేవా, త్యాగాలలోనే సంతృప్తి ఆనందాలను అను భవిస్తుంది. తన సర్వ సుఖాలను బిడ్డ చిరునవ్వులు చిం దులు వేసే ముద్దుల ముఖారవిందంలోనే చూచుకుంటుంది. తల్లిలేని పిల్లలపట్ల కన్నీరు కార్చి తన ఒడిలోకి తీసికుం టుంది. ఆ మాతృమమకార మధురధారలే మాతృవాత్స ల్యము నెరుగని అశోక్ యెడారివంటి హృదయంలో ప్రవహించి అతని జీవిత తోటను పుష్పింప చేసింది.

"అమ్మా! కాలేజీకి వెళుతున్నాను" అన్నాడు గది చక్కబెడుతున్న సరితతో. "భోంచేశావా?" అంది వెనక్కు తిరక్కుండానే. "లేదు" అన్నాడు. ఆమె ఆశ్చ ర్యంతో వెనక్కు తిరిగింది. అతను ముఖం ప్రక్కనె తిప్పుకున్నాడు. ఆమె మృదువుగా "ఎందుకు భోంచేయ లేదు?" అంది.

"ఆకలిలేదు" ఇంతలో వంటమనిషి సీతమ్మపైకొచ్చి "అమ్మగారూ ! చినబాబుగారు కాలేజీ టైమయిందని వచ్చారు. "అమ్మ ఏదని" అడిగారు. "పనిమీద ఉన్నారు, నన్ను వడ్డించమన్నారు" అన్నాను "అక్కర్లేదు" అని బయలుదేరారు. అని ఒక్క గుక్కలో అన్ని సంగతులు చెప్పేసింది. సరిత చిరునవ్వుతో అశోక్ ముఖం చూచి "సరేలే నీ వెళ్ళు సీతమ్మా!" అని ఆమెనుపంపి అశోక్‌తో "కొంచెం పని వుండి సీతమ్మను వడ్డించమన్నాను ఇంత లోకే అలగాలా ? పద వడ్డిస్తాను అంటు క్రిందికి నడి చింది. వెనకాలే అశోక్ కూడా నడిచాడు.

అన్నం వడ్డించి దగ్గర కూర్చుంది సరిత. అశోక్ మెదలకుండ కలుపుతున్నాడు. "అయితే ఒకపూట పనుండి వడ్డించకపోతే అలా వెళ్ళిపోవడమే? అంది.

"నీవు పెట్టకపోతే తినబుద్ధికాదమ్మా!" అన్నాడు.

"బాగానేవుంది నేను వడ్డించినా యిదేగా అంది నేయి వడ్డిస్తూ.

"దీనితోపాటు అమ్మ అనురాగ ధారలు కూడ ఉంటా యమ్మా!"

"అయితే నాకేదయినా రోగంవచ్చి లేవలేకపోతే?"

"అవేమి మాటలమ్మా?" అన్నాడు బాధగా.

"అవును అశోక్"

"అమ్మ ఆరోగ్యంకి అన్నం పెట్టేవరకు ఉపవాసం వుంటానమ్మా!"

"మరిబాగుంది. చచ్చిపోతేనో?"

"అలాటి మాటలనకమ్మా! ఒకసారి అమ్మ నన్ను విడిచి వెళ్ళిపోయింది మళ్ళీ వచ్చింది. వడిలోకి తీసికుంది మళ్ళీ వెళ్ళిపోతే ఈసారి నేనూ అమ్మతోనే వెళ్ళిపోతాను" అన్నాడు గద్గదంగా. సరిత కండ్లనుండి అనుకోకుండ అశృకణాలు జలజల రాలాయి. అంది. "ఇటువంటి కొడుకు వుంటే నాకింకా ఏంకావాలి?"

* * *

"ఈ ఆరు మాసాల్లోనూ ఎంత మారిపోయావు అశోక్?"

"లావయ్యాను కదూ రమా?"

"లావేకాదు ముఖంలో ఒక క్రొత్త కళ కనుపిస్తుంది అశోక్"

"కనుపించదూ మరి? నేనెంత అదృష్టవంతుడ్ననుకున్నావు రమా?"

"నిన్నంత అదృష్టవంతుడ్ని చేసిన ఆ మహత్తర మేమిటో?"

"నాకూ. ఒక అమ్మ లభించింది" అన్నాడు విజయగర్వంతో.

"అమ్మా!" అంది ఆశ్చర్యంగా.

"అవును నాన్నగారు రెండవ వివాహం చేసుకున్నారు. ఆమె ఎంత మంచిదనుకున్నావు?"

"నాకు తెలిపావేకావేం?"

"ఉత్తరాలు వ్రాయవద్దని ఉత్తరువు జారీచేసి వెళ్ళావుగా?" కొంటెగా నవ్వుతూ అన్నాడు.

"ఆమెకూడా నవ్వుతూ "అవునుకాని మీ అమ్మ అంత మంచిదా?"

ఒట్టి మంచిదికాదు మహా మంచిది, సాధ్వి."

"అబ్బా! ఏవూరు? ఏం చదువుకుంది?"

"అన్నట్లు మర్చిపోయాను మీ వూరే యింటరు పాసయింది. రామాయణ పురాణాలన్నీ ఆమెకు కంఠస్థం." అన్నాడు.

"చాలా పెద్దామా?"

"కాదు నాకంటే చిన్నదేకాని ఆమె హృదయం పెద్దది" సద్గుణాలకు ఆమెకు ఆమే సాటి"

"ఓహో, అలాగా?"

"అవును రమా! ఆమె నన్నెంత ప్రేమగా చూస్తుందనుకున్నావు, ఆమె మాటలు అమృత ధారలు, ఆమె నన్ను బిడ్డకంటె ఎక్కువగా చూస్తుంది. మొదట్లో ఆమెను నేను "ఏమండీ" అనేవాడిని కాని ఒక రోజు మృదువుగా మందలించుతు "అమ్మా!" అని పిలవమని ఆదేశించింది. నేను అమ్మా అని పిలుస్తున్నాను. ఆ పిలుపులో నాకు స్వర్గసౌఖ్యం లభిస్తుంది. నాకు ఒక అమ్మ వుందని గర్వపడుతున్నాను. మరి చెప్పు! నేను అదృష్టవంతుణ్ణి అవునా? కాదా?"

"తప్పకుండా అదృష్టవంతుడవే కాని నాకు కూడా ఆమెను చూడాలని ఉంది ఎలా?" కొంచెం ఆలోచించి అశోక్ చెప్పాడు" నీవు క్లబ్బు వర్కింగ్ కమిటీ మెంబరువు కదూ!"

"అవును"

"యికనేం మీ క్లబ్బు వార్షికోత్సవానికి ఆమెను ఆహ్వానించడానికిరా" అన్నాడు.

"భలే మంచి ఉపాయం చెప్పావు సమయానికి" అంది నవ్వుతూ.

"అంతేకాదు, ఆమెనుచూచి నీవు కొంచెం ఆడలక్షణాలు కూడా నేర్చుకోమని సలహా కూడా యిస్తున్నాను" అన్నాడు కొంటెగా.

"అయితే యిప్పుడునేను ఆడదాన్ని కాదా?"

"పూర్తిగా కాదు సగం మాత్రం"

"అవునుగాని నీవు చక్కగా ఒక్కమాసం ట్రైనింగ్ తోటే వచ్చేశావు ఎలా జరిగింది కాంపు?

"చాలాబాగా జరిగింది. తమ ఆరునెల్ల ట్రైనింగో?"

"బాగానేవుంది కాని యిన్ని రోజులు నిన్ను చూడకుండా ఉండడం ఎంత కష్టమైందో తెలుసా?"

"ఓ! తెలుస్తూనేవుంది. ఆ పాలిపోయిన బుగ్గలు, ఆ వాలిపోయిన కళ్ళు, ఆ చిక్కిపోయిన శరీరము

ఇవన్నీ నిజంగా ఆ విరహ తాపంలో తపించిన శకుంతలనే గుర్తు చేస్తున్నయి.'' అన్నాడు కవిత్వ ధోరణిలో.

"డాక్టరుగారికి కవిత్వమొస్తోందే ఇదెప్పటినుండి?'' అంది నవ్వుతు.

"ఇదిగో ఈ ముఖావాన్ని చూచినదగ్గరనుండే'' అన్నాడు ఆమె ముంగురులు సర్దుతు. ఆమె కిల కిల నవ్వింది.

"నే వస్తా మీ నాన్న వచ్చే టైమయింది" అన్నాడు. చేతి గడియారం చూచుకొని.

"మళ్ళీ ఎప్పుడో దర్శనం''

"ఒక్కసారా? వీలయినప్పుడల్లాను!" అన్నాడు నవ్వుతూ. మళ్ళీ యిద్దరూ నవ్వుకున్నారు. అశోక్ వెళ్ళిపోయాడు.

♦ ♦ ♦

"అమ్మా!" నీ కొరకు ఒక అమ్మాయి వచ్చింది!"

"ఎవరామె?"

"నా క్లాస్ మేటేనమ్మా !"

"అయితే కూర్చోమను ఇప్పుడే వస్తున్నాను" అంది అశోక్ క్రిందికి వెళ్ళి పోయడు.

"ఏమండీ!" అన్నమాటవిని చదువుతున్న పత్రికను ప్రక్కనపెట్టి ఆమె తలపైకెత్తింది. "సరితా!" అంది ఆశ్చర్యంగా,

''రమా! నీవా!" అంది సరిత కూడా ఆశ్చర్యంగా"

"ఎంత కాలానికి కలుసుకున్నాము రమా, అమ్మ నాన్న అంతాబాగున్నారా?"

"బాగానే ఉన్నారు కాని మీ అబ్బాయి నీ సంగతిచెప్పినప్పుడు ఎవరో అనుకున్నాను" వీరిద్దరి సంభాషణ ఆశ్చర్యంతో వింటున్న అశోక్‌ను చూచి సరిత అంది "రమ నేను ఫస్టుక్లాసునుండి ఇంటరు వరకు కలిసే చదువుకున్నాము"

"అవును అశోక్ సరిత నా ప్రాణ స్నేహితురాలు, ఊమెగారు చదివేరోజుల్లో కూడా ప్రత్యేకం. ఈవిడ ఆదర్శాలన్నీ వేరు" అంది.

"అవునుగాని నీవు యిప్పుడు డాక్టరు వయ్యావన్నమాట. మరి మీ ఆయనో?"

"ఇంకా పెళ్ళి కాలేదు" అంది నవ్వుతూ.

"పోనీ నిశ్చయమయ్యే వుంటుంది కదా?"

"అవునవును ప్రతి మగవాడికి ఒక ఆడది, ప్రతి ఆడదానికి ఒక మగవాడు నిశ్చమయ్యే వుంటారు" అంది అశోక్ వంక ఓరగా చూస్తూ.

"ఇంకా నీ పెంకితనం తగ్గలేదుసుమా?"

"తగ్గకేం చేస్తుందిలే అమ్మా. పెళ్ళయితే అదే తగ్గిపోతుంది.

"అసలు నా పెంకెతనంచూచి ఎవరూ చేసికోరుగా?" అంది కొంటెగా.

"అశోక్ రమ ముఖంచూచి నవ్వాడు. సరిత వైపుకు తిరిగి ఏదో అనబోయి ఆమె తమవంకే చూస్తున్నట్లు గమనించి సిగ్గుతో తలవంచుకున్నాడు. సరిత నవ్వుతూ "చేసికుండేవాళ్ళని నేను చూస్తానులే" అంది.

"సరే వస్తా'' అంటూ లేవబోయింది రమ సరిత ఆమెచేతిని పట్టుకొని "ఎక్కడికి? భోజనం చేయకుండా వెళ్ళడానికి వీల్లేదు. ముందుపైకిపద సంగతులు మాట్లాడుకుందాం అసలు నీ వొచ్చిన పని నీవూ నేనూ ఇద్దరం మర్చిపోయాం ఏమిటిచెప్పు?"

"నిజం చెప్పనా? అబద్ధమా?''

"నిజమేచెప్పు"

"నిన్ను చూడానికే ఈ వంకపెట్టుకొని వచ్చాను" అంటూ హాండ్‌బాగ్‌లో నుండి ఒక కవరు సరితకు ఇచ్చింది ఆమె అది చదువుకుని "ఇదాసంగతి" అంగి నవ్వుతూ. ముగ్గురూ పైకి వెళ్ళారు.

♦ ♦ ♦

"ఇంత ఖరీదయిన చీర ఎందుకు అశోక్ !" సరిత చీరను చూస్తూ అంది.

"ఎంత ఖరీదయితేనేం? ఈ చీర నీకెంతో బాగుంటుందమ్మా!'' అన్నాడు.

"బాగానే ఉందికాని నాకెందుకు అంట?"

"నా సంతోషానికి" అంటూ మేడమీదికి వెడదామని వెనక్కు తిరిగాడు గడపలో నిలబడివున్న తండ్రిని చూచాడు. తండ్రి ముఖంలో ఏనాడులేని కాఠిన్యత చూచి దగ్గరకెళ్ళి "ఆరోగ్యం బాగాలేదా నాన్నగారూ?"అన్నాడు వినయంగా.

"బాగానే వుందికాని బయట నీ స్నేహితుడు వామనరావు కారులో వున్నాడు వెళ్ళు" అన్నాడు. అశోక్ మారు మాటాడకుండ వెళ్ళిపోతాడు. సరిత చిరునవ్వుతోభర్తను సమీపించి "చూచారా అబ్బాయి తెచ్చాడు" అని చీర చూపెట్టింది.

"తెస్తాడు సిగ్గులేని వెధవ" అన్నాడు కోపంగా. సరిత ఆశ్చర్యానికి అంతులేదు "అలా అంటున్నారేం"

"రోజురోజుకు ఆటలు ఎక్కువయి పోతున్నయి" సరిత గుండె పగిలినట్లయింది. "ఆటలా!" అంది

"అవును మీ ఇద్దరి ఆటలు, వాడు పెండ్లి కెందుకు ఒప్పుకోవడంలేదో ఇప్పుడుతెలిసింది." అన్నాడు సరితకు భూమి తలక్రిందులయి నట్లనిపించింది. సమాధానంఏం చెప్పాలో అర్థంకాలేదు" ఇంతలో

"ఛీ. సిగ్గులేదు. పరువు ప్రతిష్టలు పోతాయనే భయం లేదు" అంటు గబగబ మేడమెట్లెక్కాడు రఘునాథ్.

మానవుడు ఎప్పుడు దానవుడికంటే భయంకరంగాను పశువుకంటే హీనంగాను, పాషాణంకంటే కఠినంగాను తయారవుతాడో చెప్పలేం. వయసు మళ్ళిన రఘునాథ్ దృష్టి సరితా అశోక్‌ల స్నేహాన్ని అనుమానించింది. అంతేకాదు వారి స్నేహం అతని హృదయంలో ద్వేషాగ్నిని రగుల్కొలిపింది.

"చినబాబుగారూ" పిలిచింది సీతమ్మ. "ఏమిటి సీతమ్మా?" అన్నాడు పుస్తకం చూస్తూనే అశోక్. ఇవి "తీసికోండి బాబూ" అంది. ఇప్పుడు అశోక్ వెనక్కు తిరిగి సీతమ్మ చేతిలో పాలగ్లాసును చూచి "అమ్మ ఏం చేస్తుంది?" అన్నాడు.

"అమ్మగారికి తలనొప్పిగా వుందిట"

"అయితే నాకు చెప్పనేలేదేం? గ్లాసక్కడ పెట్టివెళ్ళు నేను తరువాత తీసికొంటాను" అంటులేచి గదిబయటికి వెళ్ళాడు. తిన్నగా సరిత గదిలోకివెళ్ళి నివ్వెరపోయాడు సరిత ఏడుస్తుంది. నెమ్మదిగా దగ్గరకెళ్ళి "అమ్మా!" అన్నాడు. ఆమె తల పైకెత్తింది. నిష్కళంకమైన ముఖంతో అశోక్ కనుపించాడు. ఆమె దుఃఖం అధికమైంది.

"తలనొప్పి ఎక్కువగా వుందా మందుతేనా?"

"ఏమీవద్దు నీవు ముందు ఇక్కడ నుండి వెళ్ళిపో" అంది అశోక్ నిర్ఘాంత పోయాడు "కోపం వచ్చిందా అమ్మా?" అన్నాడు దీనంగా.

"కోపంలేదు ఏమీలేదు నువ్వు ముందు యిక్కడి నుండి వెళ్ళిపో అంది కన్నీటిని తుడుచుకుంటు.

"నీఒంట్లో బాధ చెపితేగాని వెళ్ళను" అన్నాడు మృదువుగా.

"నేను ఒక్తి నిర్భాగ్యురాలను అశోక్' నా ఒంట్లో బాగానేవుంది. మీ అమ్మమీద నీకు నిజమైన ప్రేమ వుంటే నన్నేమీ అడక్కుండా తక్షణం యిక్కడినుండి వెళ్ళిపో" అంది. అశోక్‌కు కళ్ళనీళ్ళు తిరిగాయి. ఏమీ అర్థంకాక అడిగితే అమ్మ మనసు కష్టపడుతుందని "అమ్మను కష్టసుఖాలడిగే అదృష్టంలేని నిర్భాగ్యుడను. వస్తాను. ఏదైనా తప్పు చేసివుంటే క్షమించమ్మా!" అంటు గది బయటకి నడిచాడు.

♦ ♦ ♦

"అమ్మా! వారంరోజులయింది నీచేత్తో అన్నంపెట్టి ఇంకా కోపం పోలేదా?" అన్నాడు బాధగాఅశోక్. భగవద్గీత చదువుకుంటున్న సరితను సమీపించి. స్త్రీ హృదయం కరిగి కన్నీరయింది. సమాధానంగా "నీవంటే నాకేవిధమైన కోపము లేదు అశోక్" అంది గద్గదంగ.

"అయితే నాకెందుకమ్మా ఈ శిక్ష?"

"ఏమీలేదు"

"ఏమీలేకపోతే యింత మార్పెందుకు వస్తుంది? ఏదో బలమైన కారణమే వుంటుంది. దాచకుండ చెప్పమ్మా చెప్పకపోతేనామీద ఒట్టే. సరిత అశోక్ ఆఖరి మాటలకు తలపైకెత్తింది. అప్పుడే పైకి వచ్చిన భర్తను ద్వారం దగ్గర చూచి అలాగే గ్రుడ్లప్పగించి వూరుకుంది. ఇంతలో "కారణం నేనే చెపుతాను విను" అన్న గంభీరమయిన తండ్రి మాటలు విని అటు చూచాడు.

"మీ యిద్దరి వ్యవహారం నాకేమీ బాగుండలేదు" ఆమాటలు విన్న అశోక్ చలించాడు. అయోమయంగా "నాన్నగారూ! మీరు మాట్లాడేది ఎవరిని గురించి?" అన్నాడు.

"యింకా స్పష్టంగా చెప్పనా? నీ సవతి తల్లితో నీ వ్యవహారం బాగుండలేదు" పిల్లి కళ్ళుమూసుకోని పాలు త్రాగితే లోకంకూడా కళ్ళుమూసుకోదు తెలుసుకోండి" అగ్ని పర్వతం పగిలినట్లనిపించింది అశోక్‌కు. అన్నాడు. "నాన్నగారూ తల్లిని నేనెరిగున్నాను. సవతి తల్లిని కాదు సరితాదేవి నాకు అమ్మ, మీరు నాకు తండ్రి. ఇంతకంటే చెప్పలేను. కాని ఒక ప్రార్థన నావల్ల ఆ పవిత్ర మూర్తికి మాత్రం కళంకాన్ని ఆపాదించకండి" అంటు తన గదికి వెళ్ళిపోయాడు.

"నాటకం, అంతా నాటకం" అంటు రఘునాథ్ తన గదికి వెళ్ళిపోయాడు. సరిత మాత్రం శిలా ప్రతిమవలె అలాగే కూర్చుండిపోయింది.

అశోక్‌తో ఎవరూ మాట్లాడడంలేదు. అశోక్ ఎవరితోనూ మాట్లాడడంలేదు. కాల చక్రంకింద నెల రోజులు నలిగి నశించిపోయాయి. రఘునాథ్ సరితతో అన్నాడు అశోక్‌ను హాస్టలుకు పంపుతున్నాను వాడిక్కడుంటె వాడి చదువు పాడవుతుంది" అన్నాడు. సరిత నివ్వెరపోయింది

"అక్కడి భోజనం అది పడుతుందా?" అంది భయ పడుతూనే ఊరుకోలేక.

"అందరికీ పడటంలేదూ అలాగే పడుతుంది" అన్నాడు.

"కాని......"

"కానిలేదు గీనిలేదు" క్రిందికి వెళ్ళిపోయాడు. మరి రెండు నిముషాలకు అశోక్ ఒక చేతిలో బెడ్డింగ్ మరొక చేతిలో పెట్టె పట్టుకొని సరితగదిముందు ఆగాడు. అతనినిచూచి సరిత కంగారుతో "ఎక్కడికీప్రయాణం?' అంది.

"నాన్నగారు పంపాలనుకున్న చోటికేనమ్మా!"

"నీకెలా తెలిసింది?"

"తెలిసింది ముందుగా నేనే ఆ ఏర్పాట్లన్నీ చేసుకున్నాను" చేతిలో సామాను క్రిందపెట్టి లోపలికి వెళుతు అన్నాడు.

"అయితే తప్పదా?"

"తప్పదమ్మా! నీకొరకైనా తప్పక నేనీపని చేయక పోతే నీకు ద్రోహం చేసినవాడినవుతానమ్మా! దీవించమ్మా! "అంటు వంగి పాదాలకు నమస్కరించాడు.

అశోక్ నెత్తిమీద రెండు వేడి కన్నీటి చుక్కలు పడ్డాయి.

"ఏడుస్తున్నావా అమ్మా" అన్నాడు.

"మీ నాన్నగారి మనసు మారుతుంది వెళ్ళకు అశోక్" అంది బ్రతిమాలుతు సరిత.

"నీమాట కాదంటున్నందుకు క్షమించమ్మా. నేనేమయినా తప్పులు చేసివుంటే క్షమించు. బిడ్డలను తల్లి కాక మరెవరు క్షమిస్తారమ్మా?" అన్నాడు గద్గదంగా.

"అశోక్!" అంది దీనంగా.

"అమ్మా ఉండమనకు ఈ దౌర్భాగ్యుడి ముఖము చూచినా పాపమే" అంటు సమాధానానికి ఎదురు చూడకుండ గబ గబ మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

"సరితా! అశోక్ ఏడీ?"

"వెళ్ళిపోయాడు" అంది.

"ఎక్కడికి"

"మీరు పంపాలనుకున్న చోటుకే"

"ఇంకా యిప్పుడే మాట్లాడి వస్తున్నాను వాడెక్కడికెళ్ళినట్లు?"

"అతనుముందే ఆ ఎర్పాట్లన్నీచేసుకున్నాడట"అంది.

"ఆ!"

"అవును."

"మంచిపనే చేశాడు" అంటు వెళ్ళిపోయాడు.

♦ ♦ ♦

"అశోక్ ఏమన్నాడు సీతమ్మా?"

"రానన్నారమ్మా, ఏమీ అనుకోవద్దన్నారు."

"మని షెలావున్నాడు?"

"ఏం చెప్పమంటారమ్మా? సగమయిపోయారు"

'అలాగా?" అని నిట్టూర్చింది సరిత.

"నేనిచ్చినవి తిన్నాడా?"

"ఒక్కటి మాత్రం తీసుకున్నారు తక్కినవన్నీ ఇవిగోనండి" అని డబ్బా ముందర పెట్టింది.

"నేను పంపానని చెప్పలేదా సీతమ్మా?"

"అందుకే ఆ ఒక్కటైనా తీసుకున్నారటమ్మా. ఇంక ఎప్పుడూ ఏమీ పంపవద్దన్నారమ్మా"

"అవును సీతమ్మా అశోక్ ఆత్మాభిమానంగల అబ్బాయి. కన్న తండ్రే అలా అనుకున్నారు. అనాదరణ చూపారు. పాపం అశోక్ హృదయం గాయపడింది." అంటు తిరిగి వచ్చిన లడ్డూలను చూచి ఆమె కన్నీరు కార్చింది.

♦ ♦ ♦

అశోక్‌కు జబ్బుగావుంది హాస్పటిల్లో చేర్చారు. అప్పడే వారంరోజులయిపోయింది. సరిత హృదయం వెళ్ళి చూడాలని తహ తహ పడుతుంది. కాని కాళ్ళకు సంకెళ్ళు. ఆమె భోజనం మానేసింది. భర్త మాత్రం వెళ్ళి చూచి వస్తున్నాడు. అతనిని అశోక్ క్షేమాలు అడిగే అవకాశంకూడా లేదు సరితకు. కాని ఆరోజు మాత్రం ఉండలేకపోయింది. అప్పుడే హాస్పటిల్‌నుండి వచ్చిన భర్తను చూచి సరిత "అశోక్‌కు ఎలా వుందండి?" అడిగింది.

"చాలా ఎక్కువగావుంది"

"అయితే నన్నొకసారి తీసికెళ్ళండి చూడాలనివుంది"

"నీవు చూడనవసరంలేదు" అని తిన్నగా మేడ మీదకి వెళ్ళిపోయాడు సరిత చిన్నబుచ్చుకున్న ముఖంతో భోజనాల గదివైపు నడిచింది.

"అశోక్! అశోక్!!" అశోక్ నెమ్మదిగా కళ్ళు విప్పాడు. ఎదురుగా రమను చూచి "రమా!" అన్నాడు నీరసంగా.

"అవును ఒంట్లో ఎలావుంది?"

"ఎలావుండాలో అలాగేవుంది రమ"

"అలా అంటున్నావేం బాధ ఎక్కువగావుందా?"

"ఎక్కువేమిటి తగ్గనే తగ్గదు రమా"

"అవేంమాటలు అశోక్ నీకో శుభవార్త చెవుదామని వచ్చాను.

"ఏమిటి రమా?"

"నీకు ఆరోగ్యం చిక్కగానే నాన్నగారు మన పెళ్ళి చేస్తామన్నారు"

"రమా నేనొక మాట చెపుతానువింటావూ?"

"చెప్పు"

"వచ్చేవాళ్ళకోసం తహ తహలాడ్డం ఏమంత తెలివైన పని?"

"అశోక్ నీ మాటలు మాటలుకావు శూలాలు" అంది గద్గదంగా.

"నేను వున్నమాటే చెపుతున్నాను రమా, నేను పరమ దౌర్భాగ్యుణ్ణి, నిర్భాగ్యుడ్ని నువు అనవసరంగా నామీద ఆశలు పెట్టుకొని అన్యాయంగా నూరేళ్ళ జీవితాన్ని నాశనం చేసుకోకు. నిన్ను బ్రతిమాలుతున్నాను. నన్ను మర్చిపో" అన్నాడు ఆయాసపడుతు. రమ కండ్ల నుండి కన్నీటి వర్షం కురుస్తుంది. "రమా!" అన్నాడు మళ్ళీ.

"అశోక్ యికనేమి చెప్పకు నీపుణ్యముంటుంది, నీవే నా సర్వస్వం అనుకున్నాను, నిన్నే నాహృదయాధినేతగా చేసుకున్నాను, మర్చిపోలేను. నీతోనేనాకీలోకం" అంది.

"రమా! నాకు T. B." అన్నాడు.

"నాకూ తెలుసు అశోక్, వస్తాను. అదుగో డాక్టరు గారు వస్తున్నారు." అంటూ వెళ్ళిపోయింది.

"తెలిసికూడా రమ నన్నే ప్రేమిస్తుందా!" అనుకున్నాడు ఆశ్చర్యంగా అశోక్.

"ఎవరో అబ్బాయి వచ్చారమ్మా! చినబాబుగారికి చాలా ప్రమాదంగా వుందిట" అన్నాడు నౌకరు వెంకయ్య పరిగెత్తుకవచ్చి

"ఆ!" అంటూ సరిత బయటకు వచ్చి ఆ వచ్చిన వ్యక్తిని "ఎలావుందండి?" అంది.

"చాలా ప్రమాదంగా వుంది వాళ్ళ నాన్నగారేరీ?" అన్నాడు.

"వారిప్పుడే ఎక్కడికో వెళ్ళారు, డాక్టర్లేమంటున్నారు?"

"ఎవరిదైనా రక్తం కావాలంటున్నారు"

"అయితే పదండి యిప్పుడే వస్తున్నాను" అ వ్యక్తి వెళ్ళిపోయాడు. నౌకరు వెంకయ్యను బండి తెమ్మంది. వెంకయ్య సందేహిస్తూ అన్నాడు.

"వద్దమ్మగారు అయ్యగారు కోపం చేస్తారు"

"వెయ్యానియ్యి వెంకయ్యా ఈ రోజువరకు ఊరుకున్నాను. యిక సహించను. బిడ్డ చావు బ్రతుకులమధ్య వున్నాడు త్వరగా బండి తే" అంది.

"సరే తెస్తానమ్మా!" అంటు వెళ్ళాడు.

"డాక్టరుగారూ! అతని వయసు వాళ్ళ రక్తమే కావాలంటే ఎక్కడ తెచ్చేది? ఎవరిస్తారు?" అన్నాడు రఘునాథ్ చికాకుగా. "నేనిస్తాను" అన్న సరితమాటలు వినబడ్డయి. రఘునాథ్ తన చెవులను తానే నమ్మలేక పోయాడు. వెనక్కు తిరిగాడు. సరితను చూచి మండిపడుతు అన్నాడు.

"నీవెందుకు వచ్చావు?" కఠినంగా.

"అబ్బాయిని చూడ్డానికి" అంది నిశ్చలంగా.

"నీ అవసరం లేదని చెప్పానుగా?" గర్జించాడు. అశోక్ కళ్ళు విప్పాడు. సరితను చూచాడు. అతని కళ్ళ వెంట కన్నీటి ధారలు ప్రవహించాయి. శక్తినంతా కూడబెట్టుకొని "అమ్మా!" అన్నాడు. సరిత అశోక్ మంచం దగ్గరకు పరిగెత్తింది. అశోక్ తలదగ్గర కూర్చొని అతని తల నిమురుతు ప్రక్కనే వున్న డాక్టరును చూచి "డాక్టరుగారూ! త్వరపడండి, నా రక్తం తీసి అశోక్‌ను బ్రతికించండి" అంది జాలిగా. డాక్టర్ రఘునాథ్ ముఖం చూచాడు. ప్రశ్నార్థకంగా, రఘునాథ్ ఆమె రక్తం తీయ

దానికి వీలులేదు" అన్నాడు కర్కశంగా. సరిత భర్తతో ప్రాధేయ పడుతు అంది "కొడుకు కొరకు ఈమాత్రం సేవచేసే అధికారం నాకు లేదా?"

"నీ కొడుకుకాడు వాడు" అన్నాడు అతికటువుగా.

"మీకు కుమారుడైతే నాకు కుమారుడు కాడా?" అంది దీనంగా.

"అధిక ప్రసంగం చేశావా? నీ మర్యాద దక్కదు" అదే సమయాన అశోక్ "అమ్మా!" పిలిచాడు సరిత అశోక్ వైపుకు తిరిగింది.

"అమ్మా! నీవు నాకంటె చిన్నే కావచ్చు కాని నా తల్లివి. మాతృ స్థానంలో ఉండి మాతృ మమకారాన్ని చూపిన సాక్షాత్తు మాతృమూర్తివి, నీ స్నేహాన్ని. వాత్సల్యాన్ని జన్మ జన్మాలకు మరువలేనమ్మా! నేను వచ్చే జన్మలో తప్పక నీ గర్భాన పుట్టి నీరుణం తీర్చుకుంటాను. భగవంతుని వచ్చే జన్మలో నిన్నే నాకు తల్లిగా ప్రసాదించమని ప్రార్థిస్తున్నాను. నావల్ల నీకు కలిగిన అవమానానికి నన్ను క్షమించమ్మా శలవు" అంటు లేవబోయి క్రింద పడిపోయాడు. అతని శరీరం సరిత పాదాలకు చల్లగా తగిలింది. ఆమె కండ్లనుండి వెచ్చని కన్నీరు కారింది. అదేసమయాన ఒక నర్సు హడావిడిగా పరుగెత్తుకొచ్చి డాక్టర్‌తో "డాక్టర్! హౌస్ సర్జన్ రమ పాయిజన్ తిన్నారు. అంతిమ క్షణాల్లో బాధపడుతున్నారు" అంది. డాక్టర్ అటు పరిగెత్తాడు. సరిత "రమ పాయిజన్ తిందా!" అంది అంతేమరు క్షణంలో ఆమె చెట్టు విరిగినట్టు పడిపోయింది. అందరు అటు పరిగెత్తారు. కాని సరిత నుదిటినుండి ప్రవహిస్తున్న రక్తాన్ని చూచి ఆగిపోయి "అయ్యో ఎంత పనైపోయింది!" అన్నారు. అక్కడే రాతివలె నిలబడిన రఘునాథ్‌ను చూచి ఇంకా చూస్తావేమయ్యా!" అన్నారు. రఘునాథ్ సమాధానం చెప్పకుండ నెమ్మదిగా భార్యదగ్గర కూర్చొని ఆమె తలను తన ఒడిలోకి తీసికున్నాడు. ప్రక్కనే అశోక్ శవాన్ని చూచి వెక్కి వెక్కి ఏడుస్తు "అమాయకులంతా నా అనుమాన జ్వాలలకు ఆహుతయిపోయారు" అన్నాడు.

---

రూపురేఖలుదిద్దిన మొదటిమహిళ —

స్కాంద మహాపురాణములోని

# చిత్రరేఖగా మారిన కుమారిక

పూర్వము ఋషభుడను చక్రవర్తి భరతఖండమును పరిపాలించు చుండెను. ఆయనకు భరతుడను పుత్రుడు గలెను. ఆ భరతుని పేరిటనే మనదేశము భరత ఖండ మనియు, భరత వర్షమనియు ప్రసిద్ధినిజెంది యున్నది. భరతుని పుత్రుడు, శతశృంగుడు. శతశృంగునకు ఇంద్ర ద్వీప, కీసేరు, తామ్ర ద్వీప, గభస్తిమాన్, నాగ, సౌమ్యగాంధర్వ, వరుణ, నామములుగల యెనమండుగురు పుత్రులు, కుమారికయను పుత్రిక యుండిరి. కుమారిక శరీరమంతయు సుందరముగానే యుండెను, గాని యామె ముఖము ఆడమేక ముఖాకృతి గల్గి చాలా వికృతముగా నుండెను. తల్లి దండ్రులు బంధుజనము కుమారికకు మేక ముఖము వచ్చుటకు కారణమేమి యని చింతించు చుండ కుమారిక జాతి స్మరణగలదై యిట్లు చెప్పెను. నేను పూర్వ జన్మమున ఒక యాడమేకను. ఒకానొక దినమున నేను మా మందనుండి తప్పి మహీసాగర సంగమ తట మందలి చెట్లలోను, తుప్పలలోను, పొదలలోను తిరుగుచూ, పొదలలో చిక్కుకొన్న దాననై చనిపోయితిని. కొన్నాళ్ళకు నా తుండెము కంఠమునుండి విడి మహీ సాగర సంగమజలము నందు పడెను. కాని తలకాయ మాత్రము నేటికిని పొదలలోనే చిక్కుకొని యున్నది. తుండెము మహీసాగర సంగమమునందు బడుటవలన తత్ప్రభావంబున మీ కుమార్తెనై బుట్టియున్నాను. ముఖము పొదలలో చిక్కుకొని యుండుటచే నా ముఖము మేక ముఖమైనది. ఇప్పుడు మహీసాగర సంగమమునకు వెళ్ళి యా తలకాయను భస్మముచేసిన మహీ సాగర జలములో కలిపినయెడల నా పైభాగము కూడ సుందరమైనది కాగలదు. మీ కాచిత్రమును చూపెదను రండనిచెప్పి యామె తల్లి దండ్రులను బంధుజనమును వెంటబెట్టుకొని మహీ సాగర సంగమము వద్దకువెళ్ళి యచట పొదలలో చిక్కుకొని యస్థిమాత్రావసిష్టమై వ్రేలాడుచున్న మేక ముఖమును తీసి సంగమ సాన్నిధ్యమునందు దానిని భస్మము చేసి సంగమ జలమునందు పడవైచెను. మేక ముఖాకృతి గలయామె ముఖము వెంటనే మనుష్యాకృతినిజెంది చూడ ముచ్చటగా పున్నమ చంద్రునివలె మెరసి పోవుచుండెను. అప్పుడామె సౌందర్యము రంభ, ఊర్వశి, మేనకల సౌందర్యమును గూడ మించియుండెను. కుమారిక రూప లావణ్యాదులను విని చాలామంది మహా రాజాధిరాజులామెను పెండ్లియాడుటకై వచ్చిరి. కాని పరిణయేచ్ఛ లేకపోవుటచే నామె యెవ్వరిని పెండ్లియాడక, రుద్రారాధన తత్పరురాలై రుద్రునకై యచటనే ఘోర తపము చేయనారంభించెను, ఇట్లు నిండుగ నొకవత్సరము ఘోర తపము చేయగా దేవదేవుడు ప్రసన్నుడై, కుమారికా. నీ తపమునకు మెచ్చితిని తోచిన వరము కోరుకొనుమని చెప్పెను. అప్పుడు కుమారిక మహాదేవునకు సాష్టాంగ ప్రణామ మొనర్చి యిట్లు పల్కెను. ఓ ప్రభూ, నిజముగ నీవు ప్రసన్నుడవైన యెడల నీ సాన్నిధ్యమును నాకు ప్రసాదింపుము. అంతకన్న వేరుకోరిక నాకులేదు. అని శంకరుడట్లే యగుగాకయని చెప్పి యంతర్ధానమును జెందెను. అనంతరము కుమారిక మేక ముఖము దగ్ధము చేసినచోట శివలింగము నొకదానిని ప్రతిష్టించి దానికి బర్కరేశ్వరమను నామమిడెను. ఈ వృత్తాంతము నారదునివలన విని తలాతలము నుండి స్వస్థికుడను నాగేంద్రుడు తద్దర్శనార్థమై భూమిని పెల్లగించుకొని బయటకు వచ్చెను. పెల్లగింప బడిన భూమిగుండా గంగపడి గొప్ప సరస్సుగానేర్పడి బర్కరేశ్వర లింగమున కీశాన్య దిశగా స్వస్థికతీర్థమను పేరుతో ప్రసిద్ధి జెందెను. కుమారికచే ప్రతిష్టింపబడిన బర్కరేశ్వర లింగమునుజూచి శివుడు పరమ సంతుష్టుడై యిట్లు వరమిచ్చెను. మృత కళేబరముల నిచటకాల్చి యస్థికలను మహీ సాగర సంగమము నందు పడవేసినయెడల మృతాత్మకక్షయ గతి సంప్రాప్తమగును. మహీ సాగర సంగమమునందు స్నానముచేసి బర్కరేశ్వరుని బూజించిన నరుల సమస్త కోరికలీడేరును కార్తిక బహుళ చతుర్దశినాడు స్వస్తిక తీర్థమునందు స్నానము చేసి యచట పితృదేవతలకు తర్పణల నిచ్చి బర్కరేశ్వరుని బూజించిన నరులు విముక్తులగుదురు. అని.

రచన: పేరి సర్వేశ్వరశర్మ, ఎం.ఎ. సాహిత్యరత్న

పైవిధముగ కుమారిక యీశ్వరుని వలన వివిధ వరములను బొంది యింటికి తిరిగి వచ్చి జరిగిన వృత్తాంతము నంతను తండ్రితో జెప్పగా నాతడు పరమ విస్మయమును జెంది సాగర సంగమ మాహాత్మ్యమును కొనియాడిన వాడై బంధుమిత్ర పరివారసమేతుడై సాగర సంగమమునకు వచ్చి యందు స్నానము చేసి దాన ధర్మము లొనర్చి తన రాజ్యమునకు తిరిగి వచ్చెను.

రాజ్యములో తనకు భాగము పంచిపెట్టమని కుమారిక యెన్నడును కోరనేలేదు. అయినప్పటికి, తండ్రి శతశృంగుడు భరత ఖండము నంతనూ తొమ్మిది భాగములు చేసి యెనమండుగురు పుత్రులకెనిమిదిభాగములు కుమారికకొక భాగము పంచి యిచ్చి తాను హిమాలయ పర్వతమునకు తపస్సుచేసుకొనుటకై పోయెను. కుమారిక స్తంభ తీర్థము నందు నివసించుచూ తన వంతు వచ్చిన ధనమును దానధర్మాదులకై వెచ్చించుచుండెను. ఇట్లుకొంత కాలము గడవగా, కుమారిక యెనమండుగురు అన్నలకు ఒక్కొక్కరికి తొమ్మండుగురు చొప్పున మొత్తము 72 మంది పుత్రులు జనించిరి. అంత వారలు కుమారికను సమీపించి, సోదరీ, నీవు మాకు కుల దేవతవంటిదానవు. మాకు ఒక్కొక్కరికి తొమ్మండుగురు చొప్పున పుత్రులు పుట్టియున్నారు. మా వంతుకు వచ్చిన యెనిమిది భాగములను 72 సమ భాగములు చేసి వాటిని కూడ డెబ్బదియిద్దరు కుమారులకు సమానముగా పంచి పెట్టుము తల్లీ యని కోరిరి. అప్పుడామె తన యన్నల వంతుకు వచ్చిన యెనిమిది భాగములను డెబ్బదిరెండు సమ భాగములుగ విభజించి వాటిని తన డెబ్బదియిద్దరు మేనల్లుళ్ళకు పంచి యిచ్చెను. అప్పుడన్నలు పరమ సంతుష్టులై తమ తమ రాజ్యములకు తిరిగి వెళ్ళిపోయిరి. అనంతరము కుమారిక గుప్తక్షేత్ర మందలి యాడు సరస్సులలోను స్నానము చేయుచూ, కుమారేశుని బూజించుచూ, మహీ సాగర సంగమము నందుండి యచ్చట స్కందునిచే నిర్మింపబడిన శివ ప్రాసాదము జీర్ణముకాగానే యామె సువర్ణమయమైన క్రొత్త ప్రాసాదమును కట్టించెను. ఆమె చేసిన ఘన కార్యమునకు శివుడు సంతసించి వెంటనే ప్రత్యక్షమై, ఓ కుమారికా, జీర్ణమైన దేవాలయమును నీవు పునరుద్ధరించితివి గావున నిటుపైన నిచ్చటి లింగమును జనులు కుమారేశ లింగమనియు, కుమారీశ లింగమనియు పిలచెదరుగాక. మరి యొక మాట కుమారికా. నీవు యౌవన దశలోనున్న దానవు. స్త్రీ భర్త లేని జీవితమును గడప కూడదు. కావున నీవు నా మాట విని ఈ తీర్థము నందే నివసించుచున్న మహాకాలుడను సిద్ధ పురుషుని బెండ్లియాడుము. నీ జీవితము సుఖమయము కాగలదు. అని చెప్పి యంతర్ధానమును జెందెను. అనంతరము కుమారిక. మహాదేవుని యాజ్ఞ ప్రకారము మహాకాలుడను సిద్ధపురుషుని పెండ్లి యాడి బహు కాలముల పాటు దాంపత్య సుఖములననుభవించి యంతమున భర్తతో సహా రుద్రలోకమునకు బోయెను. అప్పుడు పార్వతీదేవి యామెను కౌగలించుకొని, కుమారికా, భరత ఖండము నంతను, చిత్రము నందు చిత్రించినట్లు చిత్రించితివి గావున చిత్రలేఖ యను పేరుతో నా సఖురాలవుగా ప్రఖ్యాతిని జెందెదవుగాక యని చెప్పి తన ప్రియసఖిగా చేసుకొనెను. ఉష యనిరుద్ధునకు ప్రియురాలైనట్లు యోగినులలో కెల్ల శ్రేష్ఠురాలైన కుమారిక పరమసిద్ధుడైన మహాకాలుని ప్రియురాలు, చతురుదధి వేలా వలయితమైన ధరిణీ చక్రమునేలు చక్రవర్తి యొద్దు బిడ్డయైనప్పటికి కుమారిక జితేంద్రియయై తుచ్ఛస్వార్థమును విడచి దేశ సేవచేసి చివరకు శివాజ్ఞచే దాంపత్యసుఖమును బడసిన మహా యిల్లాలు. భరత ఖండమునకు రూపురేఖలు దిద్ది జగన్మాతయైన పార్వతీదేవిచే చిత్రలేఖ యని బిరుదమును బొందిన మొదటి మహిళయామె. ఆమె చరిత్రయే మహిళా సమాజమునకు గర్వ కారణమైనది. భారత దేశములో మహిళలకున్నత స్థానములేదని కొందరి భ్రమ. మధ్య యుగంలోని మాయ యేమో మనకు దెలియదు కాని వేదములలోను పురాణములలోను మహిళలకు మహోన్నత స్థానమున్నది. అయితే శాస్త్రిలను దేశ కాల పాత్రాను సారముగ సమన్వయము చేసుకొనే బాధ్యత మన పైన యున్నది. ఈ విధంగా కుమారిక చిత్రలేఖగా మారింది.

యత్రనార్యస్తు పూజ్యంతే
రమంతే తత్ర దేవతాః

నారీమ తల్లులను పూజించినచోట దేవలు క్రీడిస్తారట

# పార్వతి పసుపు

## శ్రీమతి మేడూరి నర్సమాంబ

అమ్మా! నాన్నగారు పిలుస్తున్నారు. అన్న పిలుపు వినపడగానే మొహం కడుక్కుంటున్న మాణిక్యమ్మ పరిగెత్తుకుంటూ లోపలకొచ్చింది. ఆమె చాలా కంగారుపడుతోంది. నిన్నటినుంచి డాక్టరు మందు ఇవ్వటంమానేసాడు. ఆశలేదని తెలిపోయింది. ఈవేళ రోగి చాలచలాకీగాఉన్నాడు. మాణిక్యమ్మను దగ్గరగా పిలిచాడు. భర్త తెలివిచూచి ఆమెకు సంతోషముకు వుంది. కాని ఆమె కళ్లముందు మామగారి మరణ శయ్యకనపడింది. ఆయనకు ఆఖరురోజున అతితెలివి తేటలు ఆవహించాయి. అప్పుడే ఆయన వ్యవహారాలు చక్కబరిచాడు. ఆమెలో మేఘాలు అలముకొన్నాయి. కళ్లద్వారావర్షించాయి. ఆమె దిగులుపడిపోయింది. భర్త ధైర్యంచెప్పాడు. మొహానికి బొట్టేదని అడిగేడు. ఆమె కలవరపడింది. పరిగెత్తుకుపోయి రోజుకంటె పెద్ద బొట్టుపెట్టుకొచ్చింది. మాణిక్యమ్మ తిరిగి వచ్చే టప్పటికి భర్తలో చాలామార్పులు వచ్చాయి, కళ్లమ్మట నీళ్లుధారలుగావస్తున్నాయి, ఆమె వచ్చి కళ్ళు తుడిచింది. ఆమె కళ్లమ్మట బొట బొట కారుతున్న నీళ్లను తుడుచుకోవటంలేదు. ఆయన బలవంతం ప్రయత్నంమీద బయట పడుతున్నాయి మాటలు ఆయన స్వయంగానే తలక్రింద నున్న వీలునామా బయటకుతీసాడు. ఆమె చేతికందిచ్చేడు. "ముప్పై ఎకరాలు రమణకు. ముప్పై ఎకరాలు రవీంద్రకు వ్రాసా నీకు ఈ పదిఎకరాలు మేడన్నూ నీ అనంతరం రవీంద్రకు చెందుతాయి." ఆయన ఇంక ముఖ్య విషయం చెప్పాలని చాల బాధపడుతున్నాడు. ఆమె యంత్రంలా సంచరిస్తోంది. "నాలో రెండేళ్లనుంచి జీర్ణించుకొన్నవార్త. నా కప్పుడు డాక్టరు చెప్పేడు. చిన్నబ్బాయికి గుండెజబ్బుట. జాగ్రత్తగా చూచుకో. అవసరమైతే సమయం వచ్చినప్పుడు పెద్దబ్బాయికి చెప్పు అది రహస్యంగాఉండాలి మరి మాట్లాడలేక పోయాడు ఆమెలో ఆశలడుగంటేయి రవీంద్ర చాల ఉద్రేక పూరితమైన వ్యక్తి ఇంటరు సీనియరులోకి వచ్చేడు. ఉదరనిమిత్తం ఉద్యోగాలు చెయ్యడానికి ఈ చదువులని కొద్దోగొప్పో ఉన్నవాడుకూడా ఉద్యోగాల కోసం తాపత్రయపడటంలో అర్థంలేదని అంటాడు, రాజకీయాల్లో చేరిపోయి దేశాన్ని ఉద్ధరిస్తానంటాడు. రవీంద్ర నాజూకైనమనిషి అతను మాట్లాడుతుంటే పన్నీరు చల్లినట్లుంటుంది. కోపంహెచ్చు. అతను ఏది తల్చుకుంటే అది జరిగితీరవలసిందే. రమణ తీరువేరు. సర్వసాధారణంగా చదువుతప్పించి ఇతర గొడవలు కలుగచేసుకోడు అతను ఇంజనీరుంగు నాల్గవ సంవత్సరం చదువుచున్నాడు. అతను రవీంద్రునంత నాజూకు లేకపోయినను మొహంలో ఒక ఆకర్షణశక్తి ఉంది. అతనికి తల్లి దైవసమానం

పార్వతి చిన్నప్పటినుంచి ఎక్కువకాలం ఇక్కడే ఉంటోంది ఆమె మాణిక్యమ్మ తమ్ముడికూతురు. పార్వతికి సవతితల్లి కావటంచేత మాణిక్యమ్మ ఇక్కడికి తీసుక వచ్చింది. పార్వతి అందమైనపిల్ల ఆమెను చూస్తే అందమైన వాళ్లలో ఆలవాలమైన అందాన్ని అంతటిని భగవంతుడు ఒకచోట పోతపోశాడా అనిపిస్తుంది. పార్వతి చిన్నప్పుడు రవీంద్రతో ఆడుకొనేది. రవీంద్రని ఉడికించి అతనిచే దెబ్బలు తినటంసరదా. అతని ఉద్రేకమైన ఉపన్యాసాలు మైమరచి వినేది. రవీంద్రకు ఇంకొకళ్లకు చదువుచెప్పటమంటే విసుగు రమణవద్దకూ వెళ్ళేది. రమణంటే ఆమెకు భక్తిభయం ఉన్నాయి. అతనాజ్ఞాపించిన ప్రతివిషయం అనుకరించేది రమణ పార్వతికి పాఠం చెపుతూ వుంటే ఏవో వంకపెట్టి రవీంద్ర అమ్మ కేకేస్తోందని పిలిచేవాడు. ఒకరోజు రాత్రి రవీంద్ర పార్వతిని రెండో ఆటకి అర్థించాడు, తల్లికి చెప్పి ఒప్పించాడు పార్వతి ప్రాయాణ మవక తప్పిందికాదు. ఇద్దరు బయలుదేరుతూండగారమణ ఎక్కడకనిఅడిగాడు పార్వతికంగారు పడిపోతోంది. రవీంద్ర కరటుగా సినిమాకి అన్నాడు.

మత్తేమైనా పోయిందా రెండో ఆటకి వెళ్ళవలసిన అగత్యమేమి వచ్చింది. రేపు ఏకంగా మొదటాటకి వెళ్ళవచ్చులే అన్నాడు. పార్వతి ఇంట్లోకి పారి పోయింది. రవీంద్రకు చాలా చిరాకేసింది. తిన్నగా వెళ్ళి తల్లికి ఫిర్యాదు చేశాడు, "నాయనా" అని రమణను పిలిచింది. రమణ తిన్నగావచ్చి తల్లి మంచ ముమీదకూర్చున్నాడు. పార్వతిని బ్రతిమాలి ఒప్పించి రవీంద్ర కూడా పంపించింది. మాణిక్యమ్మ లేచి వీధి తలుపువేసి వచ్చి మంచంమీద కూర్చుంది. కొంత సేప టికి మాణిక్యమ్మ మొదలు పెట్టింది. నాయనా పార్వతి అంటే రవీంద్ర ప్రాణం ధార పోస్తాడు. ఆమె గొంతుక బొంగురు పోతోంది. 'నాన్నగారు ఆయన అవసాన కాలంలో నిన్ను బయటకు వెళ్ళమని నాతో ఒక సంగతి చెప్పేరు. జ్ఞాపకంఉందా? అతను తలూ పేడు అది ఇంకెవ్వరికి తెలియరుాడదు. అవసరమైతే నీతో చెప్పమన్నారు. రవీంద్రకు గుండె జబ్బని డాక్టరు చెప్పారట ! ఆశ్చర్యంగా ఆమెవంక చూస్తు న్నాడు, ఆమె చెవుతూనే ఉంది వాడికి కష్టం కలుగ కుండా సంచరించ మన్నారు. అందుచేతనే రవీంద్ర పార్వతులకు పెళ్ళి చెయ్యాలి. అని ముఖం కేసి చూస్తోంది. అలాగేనమ్మా కాని పార్వతి మాంగళ్యం ఎన్నాళ్ళు నిలుస్తుందో అతని చుట్టూ దుఃఖం అలము కొంది. కొంతసేపటికి మాణిక్యమ్మ నీకు తగిన సంబంధము చూచి ఇద్దరికీ రేపు వేసవి సెలవల్లో పెళ్ళిళ్ళు చేయాలనిఉంది ఏమంటావ్? సరేనమ్మా ఆలోచిస్తూ అన్నాడు. రమణకు పరీక్షలై పోయాయ్. మాణిక్యమ్మ రమణకు అన్నివిధాలా సరి పోయే పిల్లను చూసింది. రమణవచ్చి ఆ పిల్లనుచూచు కోవటమే తరువాయి. ఇంతట్లో రమణవద్ద నుండి ఉత్తరం వచ్చింది, అందులో పార్వతీ రవీంద్రులకు వెంటనే వివాహము జరిగించ వలసినదనియు తాను ఉత్తరహిందూ దేశం వెడుతున్నట్లు ఇప్పు డప్పుడే రానట్లు ఉంది. మాణిక్యమ్మ విచారానికి అంతులేదు. ఏమీ తోచక తమ్ముడికి కబురు పంపింది. కొంత తర్జన భర్జన చేసాక ఇద్దరికి పెళ్ళిచేశారు. రవీంద్రకు పార్వ తియే సర్వలోకం. ఆమెను ఒక నిమిషం వదిలిపెట్టడు చదువుమాని వేశాడు. అతని ప్రవర్తన చూచి ఆమె కంగారు పడింది. అతని గుండెల్లో రెండు మూడు సార్లు పోటు రావటం డాక్టరు ఇంజక్షనిచ్చిన తర్వాత సర్దుకోవటం జరిగింది. డాక్టరు జాగ్రత్తగా ఉండమని సలహా ఇచ్చాడు. మాణిక్యమ్మ రవీంద్రను కాలేజీలో చేరమని కసిరింది. ఉద్యోగ ప్రయత్నం అశ్రద్ధ చెయ్యొ వద్దని బ్రతిమాలింది. పొలాన్నిచూచుకొమ్మని పోరింది ఇవన్నీ రవీంద్ర పెడచెవిని పెట్టాడు. ఒక రోజున రవీంద్రకు గుండెల్లో పోటు వచ్చింది—అంతే—

మాణిక్యమ్మ మంచం పట్టింది. పిచ్చి పిచ్చిగా మాట్లాడుతుంది. పార్వతి తండ్రి పార్వతిని ఇంటికి రమ్మన్నాడు అత్తయ్యను విడిచి రానంది. అక్కను బ్రతిమాలేడు—ఇంటికి రమ్మని రానంది, ఏదిచేసేదిలేక ఇంటికి వెళ్ళిపోయాడు. పేపర్లో ప్రకటన వేయించాడు అందులో తల్లి మంచం పట్టినట్లు తమ్ముడు మరణించి నట్లు వెంటనే రాకపోతే ఆమె ఆశకూడ లేదని రమ ణకు తెలిపేడు, ప్రకటన అన్ని పేపర్లలోనూ పడింది, రమణ ఉత్తర హిందూదేశం ప్రయివేటు కంపెనీలో ప్రవేశించాడు, ప్రకటన చూసాడు. ఒక్కసారి తల్లి మరణశయ్య కళ్ళముందు కనబడింది. వెంటనే బయ లుదేరి వచ్చాడు. పార్వతి యే ఉపచారాలు చెయ్యక పోతే మాణిక్యమ్మ ఎనాడో మరణించేది. మాణిక్య మ్మను బ్రతిమాలి మందు ఇస్తోంది. వీధిలో బండిఆగిన చప్పుడు విని వీధిలోకొచ్చి చూచింది. రమణ బండి దిగుతున్నాడు. అతన్నిచూని మాణిక్యమ్మతో చెప్పి ప్రక్క గదిలోకి వెళ్ళిపోయింది. రమణకు చూడగానే ఎన్నాళ్ళ నుంచో దాచి పెట్టు కొన్నట్లు మాణిక్యమ్మ బోరున ఏడ్చింది ఆమె అతి కష్టంమీద దుఃఖం ఆపు చేసుకొంది, పార్వతి చైతన్య హీనంగా ప్రక్కగదిలో పడిఉంది అమెకు క్రమేపీ స్పృహ వచ్చింది. వాళ్ళ మాటలలో క్రమేపి వినకలుగుతోంది. "నాయనా" నాయీ ఒక్క కోర్కె తీర్చు, అని బ్రతిమాలుతున్నట్లు మాణిక్యమ్మ మాట్లాడుతోంది. అతని మాటలుస్పష్టంగా వినబడు తున్నాయ్ "అమ్మ నీవుదేవతవు నావిద్యుక్త ధర్మమార్గాన్ని చూపించావ్'' అని ఆమెకు నమస్క రించాడు. మాణిక్యమ్మకు వెయ్యేనుగుల బలంవచ్చింది. పార్వతిని గట్టిగా పిలిచింది పార్వతి కదల్లేకపోయింది మాణిక్యమ్మ కేకమీద కేక వేస్తోంది పార్వతి ఒక్క అడుగు గడప అవతల పెట్టింది మళ్ళీ మాణిక్యమ్మ గట్టిగా పిలిచింది. పార్వతి పరుగున మాణిక్యమ్మ కాళ్ళమీద పడిపోయి ఆమె హృదయ భారమంతా కళ్ళనీళ్ళద్వారా ఆమె కాళ్ళమీద ఉంచినది.

---

# మహిళా సంఘాలు - సంక్షేమ కార్యక్రమం

## వికలాంగుల శరణాలయ — వార్షికోత్సవము, గుంటూరు

భారత సేవక్ సమాజ్. గుంటూరు మహిళాశాఖవారిచే నిర్వహింపబడుచున్న వికలాంగుల శరణాలయ ద్వితీయ వార్షికోత్సవము 1-5-58 వ తేదీ శుక్రవారం సాయంత్రం 5. 30 గంటలకు దేవాదాయ ధర్మాదాయ. పరిశ్రమల శాఖామాత్యులు శ్రీ అనగాని భగవంతరావుగారి అధ్యక్షతన అతివైభవంగా జరిగింది. శరణాలయ విద్యార్థుల స్వాగత గీతంతో కార్యక్రమం ప్రారంభ మయింది.

శరణాలయ సంస్థాపకురాలు, అధ్యక్షురాలు, అయిన శ్రీమతి ఆవుల జయప్రదా సాంబశివరావుగారు అతిథులకు స్వాగతం చెబుతూ శరణాలయ, పుట్టుపూర్వోత్తరాలనూ ఆశయాలనూ ఆదర్శాలనూ వివరించారు. మహిళాశాఖ కన్వీనరూ, శరణాలయ కార్యదర్శినీ అయిన శ్రీమతి జాగర్లమూడి గంగాచంద్రమౌళిగారు శరణాలయ ఆదాయ వ్యయముల నివేదికను సమర్పించారు. గౌరవనీయులైన మంత్రిగారు ప్రసంగిస్తూ, మహిళాశాఖచే స్థాపింపబడి, అతి సమర్థనీయంగా నిర్వహిస్తున్న ఈసంస్థకృషిని అభినందించారు. సాంఘిక కార్యక్రమాల్లో జరుగుతున్నకృషి యావత్తు ప్రభుత్వ పర్యవేక్షణ క్రింద జరగటం అవసరమని తాము భావిస్తున్నామనీ, సాంఘిక సంక్షేమ సంఘం వంటి సంస్థద్వారా అట్టి కృషి జరగటం అవసరమని తాము భావిస్తున్నామనీ, తమవ్యక్తిగతాభి ప్రాయాన్ని వెల్లడించారు.

భారత ప్రభుత్వ పంచవర్ష ప్రణాళికా సమాచారశాఖ ప్రాంతీయాధికారి శ్రీ గుమ్మలూరి సత్యనారాయణగారు మాట్లాడుతూ దేశంలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను సమీక్షిస్తూ ఈ మహిళాశాఖవారు చేయుచున్న కృషిని తాను స్వయంగా కొంతకాలం నుంచీ చూస్తున్నామనీ వారియొక్క ఉత్సాహ కార్య దీక్షలనుబట్టి భవిష్యత్తులో ఈ శరణాలయం చాలా అభివృద్ధిలోనికి రాగలదని ఆశీర్వదించారు.

భారత సేవక్ జిల్లా కన్వీనరు శ్రీ పి. వీరయ్యచౌదరి గారు సమాజం చేయుచున్న కృషిని వివరిస్తూ అందు మహిళాశాఖ చూపుతున్న ఉత్సాహం కార్యదీక్ష తనకెంతో ఆనందాన్ని కలిగిస్తున్నాయన్నారు.

గుంటూరు మునిసిపల్ చైర్మన్ శ్రీ నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావుగారు, మాట్లాడుతూ సేవా కార్యక్రమాల్లో స్త్రీల కర్తవ్యాన్ని వివరించి ఈ విషయాల్లో పురపాలక సంఘ సహకారం సర్వదా లభ్యమేనని తెలియజేసారు. శరణాలయ ఉపాధ్యాయురాలు శ్రీమతి సి. సుశీలాదేవిగారు అన్నిరంగాలలోనూ ముందుకురాగలదనీ అభివృద్ధిని సాధించగలరనీ చెప్పారు. శ్రీ బూర్గుల రామమూర్తిగారు వినోదా ఆర్కెస్ట్రా గుంటూరు వారి సహకారంతో సుగమసంగీత్ కచేరీచేశారు. ఈ ఉత్సవం జయప్రదంగా జరగాలని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, కేంద్రరక్షణ శాఖా ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య, కేరళగవర్నర్ శ్రీ బూర్గుల రామకృష్ణారావు, ఉత్తరప్రదేశ్ గవర్నర్ శ్రీ వి. వి. గిరి, చలనచిత్ర పరిశ్రమలో ప్రముఖులైన శ్రీ వి. నాగయ్య ప్రభృతులు పంపిన శుభసందేశాలను శ్రీ వీరయ్యచౌదరి గారు చదివారు. శ్రీమతి ఆవుల జయప్రదా సాంబశివరావుగారు వందన సమర్పణచేశారు. అనంతరం "ప్రణాళికా ప్రచారశాఖవారి సినిమా ప్రదర్శనం జరిగింది. "జనగణమన" జాతీయ గేయంతో ఎంతోమంది ప్రజల జయజయధ్వానాలతో ఆనాటి కార్యక్రమం పూర్తిఅయింది. రాత్రి 10 గ॥ లకు స్థానిక అడ్వకేట్ శ్రీ బి. వి. సుబ్బయ్యగారు మంత్రిగారికి అతిథులకు విందుచేశారు.

## అన్నారెడ్డిపాళెం సంక్షేమ కేంద్రం

ఈగ్రామమున సోషల్‌వెల్‌ఫేర్ సెంటరు ద్వితీయవార్షికోత్సవము జరుపబడెను. బీదలకు మధ్యాహ్నము అన్నదానము చేసిరి. సాయంకాలము 6. గం॥ కన్వీనరు శ్రీమతి అల్లాడి అన్నపూర్ణమ్మగారి అధ్యక్షతను సభ జరిగెను. జనవాణి ఎడిటరు శ్రీయుతులు గంగారమణయ్యగారు సభను ప్రారంభించిరి. శ్రీ కస్తూరిబాయి ఇండస్ట్రియల్‌స్కూల్ ప్రధానోపాధ్యాయురాలు శ్రీమతి వసుంధరాదేవిగారు బహుమతులు పంచిరి. డిల్లీ, పూనా, నుంచి వచ్చిన అధికారులగు శ్రీమతి చంపాఆప్‌లే, దత్తాత్రేయ కుల్‌హాత్‌కర్ గారు సభకు విచ్చేసిరి. తదుపరి పిల్లలచేత నృత్యనాటికలు ప్రదర్శింపబడెను.

ఎమ్. రామానుజులు రచించిన గ్రామసేవాతత్పరత పద్యములు చదువబడెను. జాతీయగీతము పాడిన అనంతరము జిల్లాఆర్గనైజరు గారగు శ్రీమతి ఎమ్. సుగుణమ్మగారి వందన సమర్పణతో సమావేశము సమాప్తముకాబడెను. పిల్లలకు రొట్టెలు. స్వీట్సు పంచిరి.

## మాతాశిశు సంరక్షణ కేంద్రం

శ్రీకాకుళం జిల్లా కళ్యాణయోజన సమితి యొక్క మొదటి ప్రాజెక్టులోన నౌపడా కేంద్రము యొక్క వార్షికోత్సవము తే 28-3-58 దీని జరుపబడెను. జిల్లాప్రాజెక్టు ఇంప్లిమెంటింగ్ కమిటి చైర్మన్ గారైన శ్రీ డి. ఎస్. శాస్త్రిగారు అధ్యక్షులుగా నుండి సభను జయప్రదము గావించిరి. కేంద్రములోని స్త్రీ బాల వృద్ధులు అత్యుత్సాహముతో పాల్గొనిరి.

గ్రామ కమిటి అధ్యక్షురాలగు శ్రీమతి బెన్నూరు కమలమ్మగారు కేంద్రము ప్రారంభింప బడిననాటి నుండి జరిగిన కార్యక్రమములను ఇంతవరకు గ్రామ కేంద్రములోని స్త్రీలు సంక్షేమ ఆశయములనెట్లు నిర్వహించిరో వక్కాణించిరి. కేంద్రమునకు ఎల్లప్పుడు మహిళలు వచ్చి అన్ని కార్యక్రమములలో పాల్గొను చుందురనియు కుట్ల విషయములలో నౌపడా సెంటరులోని వనితలు అమితమైన ఉత్సాహము చూపుచున్నారు కావున కేంద్రమునకు రెండవ కుట్టుయంత్రము యెంతయేని అవసరమనియు పల్కిరి. సభలో శ్రీ నారాయణరావుగారు. శ్రీ రెడ్డిగారు మహ్మద్ అహ్మద్ గారు. తిమ్మరాజు వెంకటశివరావు గారు మాట్లాడిరి. శాస్త్రిగారు తమ ఉపన్యాసములో గ్రామ ప్రజలయొక్క ఉత్సాహమునకు, సహకారమునకు తమ సంతోషమును వెలిబుచ్చిరి కేంద్ర బాలికలచేత వివిధ నాటికలు వేయబడెను. కేంద్ర బాలికలుచేత బుర్రకథాగానము కూడ చేయబడెను. ఆటల పోటీలలో గెలుపొందిన బాలికలకు శాస్త్రిగారు బహుమతుల నొసంగిరి. కేంద్రములో పనిచేయుచున్న శ్రీమతి బీగం. శౌలీనా, రాజేశ్వరమ్మగారలు సభను జయప్రద మొనరించిన సభ్యులకు ధన్యవాదములు తెల్పిరి. జాతీయగీతముతో సభముగిసినది.

## మహిళా సంఘం గుడివాడ

గుడివాడ పట్టణ మహిళా సంఘ నాల్గవ వార్షికోత్సవము 23-4-58వ తేదీన కస్తూర్బా మందిరము (మహిళామండలి స్వంతభవనము)న జయప్రదముగా జరిగినది.

ఉదయము 8. 30 లకు మహిళా మండిలి హిందీ విద్యార్థినుల ఝండావూంచ్చారహేహమారా అనే ప్రార్థనతో ప్రారంభమైనది. ఎ. వనలతగారు జెండా ప్రతిష్ఠాపన చేసిరి. 9 గం శ్రీమతి మద్ది రంగనాయకమ్మ ఎమ్. ఏ. గారు క్యాంటీను (ఫలహారములశాల) ప్రారంభించిరి.

సాయంత్రము 4. 30 గం॥ శ్రీమతి వల్లభనేని సీతామహలక్ష్మమ్మ మాజీ ఎమ్. ఎల్. ఏ. గారి అధ్యక్షతను బహిరంగ సభజరిగినది. కార్యదర్శిని శ్రీమతి అయ్యంకి సీతారాంగారు సంఘవార్షిక నివేదిక చదివిరి. సభను ప్రారంభిస్తూ శ్రీమతి ముల్పూరి చుక్కమ్మగారు మహిళల అనేక సమస్యలను జాతీయ పోరాటములలో మహిళలు నిర్వహించిన పాత్రలను విపులముగాచెప్పిరి. బిడ్డల పోషణ స్త్రీలఆరోగ్యము. స్త్రీల ఆస్తిహక్కులు గురించి తమఉపన్యాసములో పేర్కొనిరి. సూరపనేని మనోరమ గారు స్త్రీలు అధికముగా సంఘ సేవచేయవలెనని ద్వేషము అసహనము ఈర్ష్యలు వదలి పరస్పర సహకారముతో వుండవలెనని చదువుకున్న స్త్రీలు వుద్యోగమేచేయనక్కర లేదని వివరించిరి.

అధ్యక్షురాలు పొదుపు ఉద్యమము, ద్వితీయ పంచ వర్ష ప్రణాళికల గురించి తెల్పిరి. ఎ. వనలతగారు సంఘము తరపున కృతజ్ఞతాభి వందనములు సమర్పించిరి. విద్యార్థినుల "జనగణమన" ప్రార్థనతో సభ ముగిసినది.

సభానంతరము కుమారి చేబ్రోలు సరోజ అన్నపూర్ణ, జయ. బృందము తమ భరత నాట్యముతో సభికులను ఆనందపరచిరి.

సంఘాధ్యక్షురాలు శ్రీమతి ఈడ్పుగంటి బాపమ్మగారు నాట్యముచేసినబాలికలకు రజితపాత్రలను బహూకరించిరి గండికోట హరనాధబాబు విచిత్ర వేషధారియై పాటలు పాడెను.

# పొడుపు కథ

రచన: శ్రీ కుమారి కాండ్రేగుల శారద

నక్షత్ర వీధికి నాథుండు ఎవ్వడు
రంగయిన గుడిలోని లింగ మెద్ది
        వాహనంబుల మీది వన్నెకు మొదలేది

దేవతా ఋషులకు తిండి యెద్ది.
        నరకాసురుని గన్న నాతి నామంబేది
        పొలతి చక్కదనంబు పోల్చ నెద్ది

తల్లికి కడబుట్టు తనయుని మీదేది
        కమలాప్తు బింబంబు కప్పునెద్ది

        ఇన్నిటికి ఇన్ని రెండేసి అక్షరములు
        ఆమలుడవంగ ; తుదలెల్ల ఆమలాయె

        చెప్పిన యతడు భాగ్య చక్రవర్తి
        చెప్పలేకున్న నీ మోము చిన్నబోవు.

ఈ పద్యమునకు సమాధానము [illegible] ఈ పద్యమందే స్పష్టముగ వివరించబడి యుండెను ఎట్లన ఆమలుడవంగ.... ఆమలాయె :—— అనగా ఒక సమాధానము చివరి అక్షరము రెండవ సమాధానము యొక్క మొదలు అగును, ఉ:- శశిలోని "శి" తో రెండవ సమాధానము చెప్పబడెను.

---

## సమాధానము

| | | |
|---|---|---|
| శశి | శిల | లక్క |
| కంద | ధర | రంభ |
| భ్రమ | మబ్బు | |



## అమెరికాకు వెడుతున్న

## కుమారి గిరిజ

కుమారి అనంతనారాయణ గిరిజ వయస్సు 25 సంవత్సరాలు. ఆమెకు 1958-59 సంవత్సరానికి రోటరీ ఫౌండేషన్ ఫెలోషిప్ (స్కాలర్ షిప్) ఇచ్చారు.

దీనితో ఆమె న్యూహేవెన్ (అమెరికా) లో ఉన్న యేల్ యూనివర్సిటీలో బాలవైద్యంలో ఉన్నత విద్యాభ్యాసం చేయడానికి వెడుతున్నది. కుమారి గిరిజ డాక్టర్ ఏ. అనంత నారాయణ కుమార్తె. 1955 లో స్టాన్లీ మెడికల్ కాలేజీలో పట్టా పుచ్చుకొన్నది. ఆ కాలేజీలోను, ఆబ్‌స్టెట్రిక్స్‌లోను ప్రత్యేక నైపుణ్యంపొంది డిప్లొమా పుచ్చుకొన్నది. ప్రస్తుతం ఆమె స్టాన్లీ ఆస్పత్రి పిడియాట్రిక్స్ డిపార్టుమెంటులో అసిస్టెంటుగాపని చేస్తున్నది.

చాల హెచ్చు మార్కులతో ఉత్తీర్ణులైన విద్యార్థులకు రోటరీ ఫెలోషిప్‌లు ఇస్తూంటారు. ఈ విద్యార్థులు తమ స్వదేశంలో తప్ప ఒక ఇతర దేశంలో సద్భావ రాయబారులుగా వుంటూ, ఒక సంవత్సరంపాటు ఉన్నత విద్యాభ్యాసం చేయవచ్చు. సగటున ఒక్కొక్క విద్యార్థికి 3000 డాలరు ఇస్తారు. ఈ ఫెలోషిప్ కార్యక్రమం ప్రారంభించినప్పటినుంచి ఇంతవరకు 64 దేశాలలో మొత్తం 1065 మంది యువకులకు ఈ స్కాలర్ షిప్‌లు ఇచ్చారు. వీరు 43 ఇతర దేశాలలో విద్యాభ్యాసం చేశారు. వారందరికీ కలిపి ఇవ్వబడిన గ్రాంటుల మొత్తం 26, 00, 000 డాలర్లు.

కుమారి గిరిజకు ఈ స్కాలర్ షిప్ ఇవ్వవలసిందని మద్రాసు రోటరీ క్లబ్ వారు సిఫారసుచేశారు.







ఆంధ్ర మహిళా సభ —

ఆవరణలో ప్రతీ రోజూ బీద— బాల బాలికలకు జరుగుచున్న పాల పంపకం-

మార్చి నెలలో- 4693

ఏప్రిల్ నెలలో- 4810

ఈ పాల పంపకం ప్రతీ రోజు ఉదయం 7 గంటలకు జరుగుచున్నది.

ఆం. మ. స.



# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the month of March & April

| OUT-PATIENT REGISTER | March | April |
|---|---|---|
| No. of Surgical cases treated | 49 | 59 |
| ,, ,, Medical ,, ,, | 978 | 1030 |
| ,, ,, Ante-natal ,, ,, | 345 | 287 |
| ,, ,, Post-natal ,, ,, | 112 | 125 |
| ,, ,, E.E.N.T. ,, ,, | 67 | 94 |
| ,, ,, Gyneac ,, ,, | 205 | 204 |
| Total No. of New patients | 1756 | 1799 |
| ,, ,, ,, Old patients | 2637 | 2224 |
| Grand total | 4393 | 4023 |

| ADMISSION REGISTER | | |
|---|---|---|
| No. of Patients admitted for deliveries | 165 | 165 |
| ,, ,, Medical cases treated | 69 | 58 |
| ,, ,, Post-Natal ,, ,, | 5 | 6 |
| ,, ,, Gyneac ,, ,, | 47 | 45 |
| ,, ,, Surgical ,, ,, | — | 1 |
| ,, ,, Lodgers | 132 | 125 |
| Grand total | 418 | 400 |

| IN-PATIENT MATERNITY REGISTER | | |
|---|---|---|
| No. of Normal deliveries | 127 | 120 |
| ,, ,, Abnormal deliveries Forceps 4 } Version 1 } | 5 | 6 |
| Grand Total | 132 | 126 |

NURSES' TRAINING CENTRE FOR AUXILIARY NURSE-MIDWIVES

At present there are 60 candidates undergoing training in the Andhra Mahila Sabha Nursing Home, Madras Out of these, 15 candidates belong to IV batch, 30 candidates to the V batch and the remaining 15 to VI batch. The III batch students 15 in number have completed their 2 years course and left the Institution by the end of July 1957. All the 15 of the III batch and 2 of the II batch have appeared for the examination in Midwifery and passed successfully. 7 candidates of the IV batch completed their training at Women & Children Hospital, Egmore and the remaining 8 candidates are undergoing training at Egmore. 5 girls of the IV batch have also completed their Domiciliary training at Nellore. 30 candidates of the V batch have finished their training at Govt. General Hospital and sent up for their First examination. VI batch of 15 candidates have started with their preliminary training.

Mrs. V. LAKSHMI PARVATHI
*Secretary and Convenor*

Dr. M. PAVANA BAI
*Medical Superintendant.*




# చెంచు లక్ష్మి

రవికాంతి. వి. కృష్ణారావు

బి. ఎ. ఎస్. (ప్రొ) దక్షిన్‌స్వారి చెంచులక్ష్మి యీ నెల (ఏప్రిల్) 9 వ తేదీని ఆంధ్ర అంతటా విడుదలయింది. నటీ నటులు:- అంజలి, సంధ్య, పుష్పవల్లి, నాగేశ్వరరావు, రేలంగి, ఎస్. వి. రంగారావు, మాష్టర్ బాబ్జి, గుమ్మడి (గెస్ట్ఆర్టిష్టు) మొదలయిన వారు.

బి. ఎ. సుబ్బారావుగారు "రాజు-పేద" తర్వాత యీచిత్రాన్ని చాలా కాలానికి నిర్మించారు.

శ్రీ మహావిష్ణువు ధరించిన దశావతారాల్లో హిరణ్యాక్షుని చంపి భూభారాన్ని తొలగించడానికి ఎత్తిన వరహావతారం ఒకటి, తన సోదరుని చంపెనన్న క్రోధముతో, హిరణ్యకశిపుడు తన గురువు సలహా ప్రకారం, (విష్ణువుని జయించడానికి) ఘోర తపస్సు చేసి తనకు దేవ, దానవ, మానవుని చేతగాని, రాత్రి గాని, పగలుగాని, గాలిలోగాని. భూమి మీదగాని చావులేకుండా బ్రహ్మ వల్ల వరం పొందాడు. బ్రహ్మ వరం పొందిన హిరణ్యకశిపుడు, దేవేంద్రుని పద భ్రష్టునిచేసి, విష్ణువును వెదికి, వెదికి, విసిగి పోయాడు. విష్ణువు ఇది సమయంకాదని పారిపోయి, హిరణ్యకశిపునకు అప్పటిలో ఊడిగం చేయుట తప్ప గత్యంతరం లేదని నచ్చచెప్పి, మహాలక్ష్మి కళను తీసివేసి దానిని పండుగా మార్చి గరుడాద్రి వనంలో భద్ర పరిచేడు.

మహావిష్ణువు, ఆదిలక్ష్మి వివాహ సమయంలో దుర్వాస మహాముని శాప కారణంగా సముద్రుడు భూలోకంలో చెంచుకులంలో జన్మించి, నాయకుడవుతాడు. విష్ణువు. ఆదిలక్ష్మి మరలా సముద్రునికి (చెంచు జన్మలో) కుమార్తె అల్లుడు అయ్యేటట్లు, ఆ నిజం తెలియగానే, నిజరూపు వచ్చేటట్లు శాపంమార్పు చేస్తాడు. ఎన్నివున్నా ఎన్నాళ్లకు బిడ్డలు లేనందున బాధపడుతూ నారదుని వల్ల గరుడాద్రి వనములోని ఫలమునుపొంది, ఆ చెంచు దంపతులు ఒక పుత్రికను త్వరలో పొందుతారు. నారదుడు ఆమెకు చెంచులక్ష్మి అని నామకరణంచేస్తాడు.

యింతలో యిక్కడ హిరణ్యకశిపుడునికి ఒక కుమారుడు కలిగి ప్రహ్లాదుడను పేర ఎల్లప్పుడూ హరి నామస్మరణతోనే పెరుగుతూవుంటాడు. తనకు కంటక ప్రాయమైన హరిని తలంచవద్దని ఎన్ని మార్లో కుమారునికి భోధించి విసిగి, చివరకు చంపప్రయత్నించి విఫలుడై, అంతటనూ హరి వున్నచో యీ స్తంభములో చూపుమని తన గదవిసరగానే, ఆంముండి, ఉగ్ర నరసిహావతార రూపంలో విష్ణువు వచ్చి, తన తొడలపై, అసురుసంజవేళ గోళ్లతో హిరణ్యకశిపుని హృదయము చీల్చి చంపెను.

ఉగ్ర నరసింహస్వామి తాపమును, బహ్మాది దేవతలు చల్లార్చలేక, చివరకు ఆడివిలో చెంచులక్ష్మి స్పర్శ

# చెంచు లక్ష్మి

వల్ల నరహరి రూపం పొందుతాడు. తర్వాత నారదుని సలహాతో వారిద్దరికి వివాహంజరుగుతుంది.

యీ సంగతి తెలిసి ఆదిలక్ష్మి ప్రాయోప వేశం చెయ్యబోగా నారదుడు వాదించి, ఆ చెంచుపడుచు తన కళయేనని పూర్వవృత్తాంతము చెప్పి, ఆదిలక్ష్మిని, శ్రీ మహావిష్ణువును ఆవతరింప చేసి, సముద్రుని శాపము విమోచనము జరుగుతుంది.

చిత్రము ఆట్టే నిడివి లేకుండా, విసుగు పుట్టకుండా చాలాచక్కగా టెంపో చెడిపోకుండా నడిచింది. సెట్టింగులు చాలా బాగున్నాయి; కాని వాటికి సరిపోయినంత సంతృప్తికరంగా ఫొటోగ్రాఫ్ లేదు. కాని ఫరవాలేదు. యీ చిత్రంలో ఉన్న రెండు డాన్సులు కోయడాన్సులే అవడంచేత ప్రేక్షకులకు ఆశించినంతగా సంతృప్తి నివ్వలేదు. తెలుగివారి నారద పాత్ర దాన్ని మరపించింది. భూకైలాస్ లో నారదుని కంటె యీ నారదుడు చాలా చక్కగా సహజంగా నటించి, ఏ పాత్రకు ఎటువంటివారు సమర్థులో బాగా నిరూపించేరు. మాధవపెద్ది తెరవెనుక గాత్రంతో, హిరణ్యకశిపుడుగా శ్రీ. రంగారావు చాలా గంభీరంగా (మరోఘటోత్కచుడులా) అవతరించి, కారెక్టర్ ఆక్టర్ గా తన సామర్థ్యాన్ని మళ్లీ రుజువు చేసికొన్నారు, శ్రీ నాగేశ్వరావు, మహావిష్ణువుగా బాగానే నటించేరు. ముఖ్య పాత్ర. అయినప్పటికి, పాత్రలో ఆట్టేవిశేషం లేకపోయినా ప్రతిభావంతంగానే యుంది. వయసు ముదురుతున్నా, నటనలో బిగువు పోకుండా ఆంజలీ దేవిగారి నటన మళ్లీ వున్నత స్థాయిలోవుంది, మాష్టర్ బాబ్జీ ప్రహ్లాదుడుగా అద్భుతంగా నంటించేడు. మాట, పాట, ప్లేబాక్ అయినప్పటికి, ప్రతి అక్షరం తన నోటినుండి వచ్చినట్టే ఎక్కడా ప్లేబాక్ అన్న విషయం తెలియకుండా చాలా చక్కగా నటించేడు. (యిది ఎడిటింగ్ ప్రతిభ అందుకుంది మిగతావారి ఉచ్చారణ, పాత్ర కదలికతో అంతగా సింక్రొనైజ్ కాదు) యిక ముందు యితనికి మంచి భవిష్యత్తుకలిగే సూచన లున్నాయి. సంధ్య, పుష్పవల్లి, వంగర, నల్లరామమూర్తి, వారి పాత్రకు లోటులేకుండా నిర్వహించారు. రాజేశ్వరావు మ్యూజిక్ లో క్రొత్తదనమేమిలేదు. యీ తరగతి సంగీతం యిదివరకప్పుడే, విన్నట్లువుంది. కాని, తీరుబడి సమయాల్లోను, స్నానాల గదుల్లోను, పల్లించుకుందికి, ప్రజాదరణ పొందడానికి సందేహంలేదు ప్లేబాక్ పాటలలో శ్రావ్యతకు లోటులేదు. కొన్ని పాటలు, పద్యములు చాలా బాగా పాడేరు, డైరెక్షన్. బాగుంది.

మొత్తంమీద అక్కడక్కడ టెక్నికల్ పొరపాట్లు వున్నప్పటికి (అవి లేకుండా తీయడంలో సాధ్యం కాదేమో !) చిత్రం బాగా తీయడంలో సుబ్బారావు గారు కృతకృత్యులయ్యారు. చిత్రం ప్రజాదరణ పొంది, డబ్బు చేసుకుందుకు లోటులేదు.




## జయభారతి

(గీతావళి) రచయిత : పైడిపాటి సుబ్బరామశాస్త్రి

మూల్యం. ఎనిమిదణాలు

భారతజాతీయ సమరమునందు పాల్గొనిన సుప్రసిద్ధ నాయకులను గురించియు, ఆంధ్రరాష్ట్రమును గూర్చియు వివిధ విషయములను పొందుపరచి "జయభారతి"యను జాతీయగీతములను పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు రచించిరి. పెద్దల మన్నన లందుకొన్న వీరి రచనలు ఆంధ్రుడైన ప్రతివాడును చదివి ఆనందింపక మానరు.

## శ్రీరామానుజ కీర్తికౌముది

సంపాదకులు : ధనకుధరం వరదాచార్యులు.

ప్రాప్తిస్థానము : వైద్యవిద్యా సంస్థానము.

ఆలపాడు వయా తెనాలి.

భగవంతుని గురించి తెలియజేయు వివిధ మతముల సిద్ధాంతములను గూర్చి విమర్శనాత్మకమైన దృష్టితో రచింపబడిన వ్యాసముల సంపుటియే రామానుజ కీర్తి కౌముదియను గ్రంథముగా ప్రచురింపబడినది. ఈ గ్రంథమునందు శ్రీ శంకర రామానుజుల అద్వైత విశిష్టాద్వైత మత సిద్ధాంతములను విమర్శించి. రామానుజుల వారి యొక్క భక్తిమార్గమును ప్రకాశింప బడియున్నది.

మానవుడు తరించుటకు రెండేమార్గములున్నవి. భక్తిచేతగాని జ్ఞానముచేతగాని ముక్తి పొందవచ్చును. ఎవరి యోగ్యతకు తగినట్లు వారలంధింపవచ్చును, జీవితమును సుఖముగ గడుపవలెనన్న ప్రతిమానవునకును ఆధ్యాత్మిక సంబంధమైన జిజ్ఞాసపుండి తీరవలెను. అట్టిజిజ్ఞాస గల వారికి భగవత్తత్వమును ప్రతిపాదించునట్టిదియునగు యీ గ్రంధరాజము మిక్కిలితోడ్పడునని భావించు చున్నాము.

## సరోజినీదేవి

రచన : పుటపర్తి నారాయణాచార్యులు.

సంస్కృతి ప్రచురణ. వెల. రూపాయి

భారతదేశ స్వాతంత్ర్య సిద్ధి కొఱకై అనేక మంది మనదేశ నాయకులు తమ జీవితసర్వస్వములను ధారవోసిరి. అట్టి స్వార్థరహితమైన త్యాగమొనర్చుటలో పురుషులతోపాటు స్త్రీలు కూడ దాస్య విముక్తికై పోరాడియుండిరి. గడపదాటిన గౌరవహాని యగునను నమ్మికగల ఆనాటి సాంఘిక కట్టుబాటులకు సైతము లెక్కచేయక శ్రీమతి సరోజినీదేవి విద్యనార్జించుటయేగాక దేశస్వాతంత్ర్యము కొఱకు పోరాడిన నారీమణులలో నగ్రగణ్యురాలు. ఈమె జీవిత విశేషములను తెలియజేయు యీ గ్రంధమును స్త్రీ పురుషులెల్లరును ముఖ్యముగ చదువ తగియున్నది.

## వరదకృష్ణమ్మ

రచన : పైడిపాటి సుబ్బరామశాస్త్రి

గేయసంపుటి. వెల: ఎనిమిదణాలు

వర్షాకాలమందలి కృష్ణవేణీ ప్రవాహము వలెనే యీ వాణికూడ వీరిగేయములలో ప్రవహించిన దన వచ్చును. వాడినది గ్రామ్యభాషయైన. భావము ఉన్నతమైయున్నది. సామాన్య జనానీకమున కందరకిని అర్థమై ఆనందమిచ్చుననుటకు సందియములేదు. కృష్ణవేణమ్మ తల్లి వరదలతోపాటు గోదావరీ, శబరీ, కిన్నెరసానీ, ఏటికాలువ మొదలైన వాటి వరదలతోకూడ వీరి హృదయము ఉప్పొంగి గేయరూపమున ఆంధ్రవాఙ్మయ మలంకరించినందులకు వీరెంతయు అభినందనీయులు.

శ్రీమతి జి. సుందరీశంకరం.

# మెట్రిక్ పద్ధతి

## తూనికలు, కొలతలు అమలు



ఈనాడు దేశమంతటికీ వర్తించే ఒకే విధమైన తూకాలు, కొలతల పద్ధతి మనకు లేదు. వివిధ ప్రాంతాలలో సుమారుగా 143 వివిధ పద్ధతులు అమలులో వున్నాయి. ఇన్ని పద్ధతులు వుండటం వలన, తూకాలలో ఎన్నో తకరాలు జరుగుతున్నాయి. ఇలాగు కాక, మెట్రిక్ తూనికలు, కొలతల పద్ధతి దేశమంతటిలోనూ అమలులోనికి వస్తే, దశాంశ పద్ధతి మారకం దృష్ట్యా, మనకు లెక్కలు కట్టడం బహు తేలిక అవుతుంది; అన్ని విధాలా సౌకర్యంగా వుంటుంది. తూనికలు, కొలతల ప్రమాణీకరణ చట్టం (1956) ప్రకారం మెట్రిక్ పద్ధతిలో మూల ప్రమాణాలు నిర్ణయింపబడ్డాయి. ప్రజలకు ఏ విధమైన ఇబ్బంది, అసౌకర్యమూ లేకుండా ఈ పద్ధతి క్రమంగా అమలు పరుస్తారు.

ఈ పద్ధతి ప్రవేశపెట్టబడిన ప్రాంతాలలోనూ, వ్యాపారాలలోనూ ఆ తరువాతకూడా పాత పద్ధతి తూనికలు, కొలతలు మరి మూడేళ్లపాటు వాడుకోనిస్తారు

**1958 అక్టోబరునుండి**

**మెట్రిక్ పద్ధతి**

**తూనికలు కొలతలు**

**ప్రవేశ పెడతారు**

మెట్రిక్ తూనికలు తెలుసుకోండి



తూకంలో ప్రమాణం

కిలోగ్రాం = (3 4/7 సేర్లు—1 సేరు = 24 తులాలు)

లేక 2 పౌ. 3 ఔన్సులు

చిన్న ప్రమాణాలు

| | | |
|---|---|---|
| 10 మిల్లిగ్రాములు | = | 1 సెంటిగ్రాము |
| 10 సెంటిగ్రాములు | = | 1 డెసిగ్రాము |
| 10 డెసిగ్రాములు | = | 1 గ్రాము |
| 10 గ్రాములు | = | 1 డెకాగ్రాము |
| 10 డెకాగ్రాములు | = | 1 హెక్టోగ్రాము |
| 10 హెక్టోగ్రాములు | = | 1 కిలోగ్రాము |

పెద్ద ప్రమాణాలు

| | | |
|---|---|---|
| 100 కిలోగ్రాములు | = | 1 క్వింటల్ |
| 10 క్వింటల్సు లేక 1000 కిలోగ్రాములు | = | 1 మెట్రిక్ టన్ను |

1

MA-57/240

భారత ప్రభుత్వం వారిచే జారీ చేయబడినది

